


సంపుటి:1 సంచిక: 2 పుటలు: 68 విడి ప్రతి వెల: 25 రూ. ఫిబ్రవరి 2015



**Editor:** Narayana Sarma

**Owned, Printed and Published by:**
Kottapalli Prachuranalu,
1-127/A, Near MRO Office,
Chennekothapalli,
Ananthapuramu District
Andhra Pradesh-515101
Website: http://kottapalli.in
Email: team@kottapalli.in
Phone: 7702677670

**Printed at:**
Mudrica Offset Printers,
Sanyasi Raju street,
Gandhi Nagar,
Vijayawada,
Andhrapradesh
Phone: 08662579129

**Title Verified By RNI**
APTEL/14249/01/1/2014-TC

**సంపాదకులు:** నారాయణ శర్మ

**గౌరవ సలహాదారు:** యు. సుబ్బరాజు

**ప్రచురణ:**

కొత్తపల్లి ప్రచురణలు, చెన్నేకొత్తపల్లి

**సహకారం:**

సత్య - ఫౌండేషన్ ఫర్ ఎ హెల్దీ సొసైటీ, చెన్నూరు.

**చిత్రాలు:**

వీరాంజనేయులు: 7799260684

అడవి రాముడు: 9491870753

ఫైనార్ట్స్ చదువుతున్న ఇతర మిత్రులు కూడా.

**వెబ్సైటు నిర్వహణ:**

ఆనంద్, లక్ష్మి

**వాణిజ్యం, మార్కెటింగు:**

కె. మల్లికార్జున: 9000453887

# విషయ సూచిక

## ముందుమాట





## ధారావాహిక



## పిల్లలు రాసిన కథలు















## పెద్దలు రాసిన కథలు







## అనువాద కథలు





## అవీ-ఇవీ





ముఖచిత్రం: గాలిపటాలు

చిత్రకారుడు: వినాయక్




# గాలి పటం

సంక్రాంతి సెలవులు కదా అని హైదరాబాదులో మా చెల్లెలింటికి వెళ్లా. పదేళ్ల అభి నన్ను చూడగానే అడిగాడు.



"మామయ్యా! నీకు గాలిపటం చ్చేయటం వచ్చుట కదా, అమ్మ చెప్పింది?" అని.

"చిన్నప్పుడు న్యూస్ పేపర్లతో చేసి ఎగరేసే వాళ్లంరా, ఇప్పుడు మర్చిపోయినట్లున్నాను" అన్నా.

"ఏం కాదులే, ఒకసారి నేర్చుకొని చేసేస్తే, అవి ఇక మన బ్రెయిన్‌లోంచి పోవట-మా టీచర్ చెప్పింది. అయినా ట్రై చెయ్యి, ఎట్లా వచ్చినా నేనున్నా కద, ఎగరేసేందుకు?!" అన్నాడు అభి.

"సరేలేరా! ఓ పెద్ద న్యూస్ పేపరు తీసుకురా, ఓ పేజీ చింపు జాగ్రత్తగా!" అన్నా.

వాడు తెచ్చాడు.

నాలుగంచులూ సమానంగా ఉండేట్లు చింపు, ఓ చతురస్రం చెయ్యి అన్నా.

చక్కగా చేశాడు.

ఇప్పుడు మంచి కొబ్బరి చీపురు పుల్లలు రెండు పట్టుకురా అన్నా.

తెచ్చాడు.

మిగిలిన న్యూస్ పేపరులోంచి ఒక అంగుళంన్నర-రెండంగుళాలు వెడల్పుండే ముక్కలు చేసిపట్టుకో, అలాగే మంచి బంక తీసుకురా అన్నా.

పాపం శ్రద్ధగా చెప్పినట్లు చేశాడు.



"ఇప్పుడి ఒక పుల్లని ఆ చతురస్రానికి అడ్డంగా పెట్టు- రెండు చివర్లలోనూ బంకరాసిన కాయితం ముక్కలు అంటించెయ్, పుల్లకదలకుండా-"

అంటించాడు.

"సరే, ఇప్పుడు రెండో పుల్లని ధనస్సులాగా వంచు. బొమ్మలో చూపించినట్లు బంకరాసిన కాయితాలతో మూడు నాలుగు చోట్ల అంటించెయ్, కదలకుండా-"

కొంచెంకష్టపడ్డాడు గానీ బాగానే చేశాడు.

"ఇప్పుడు గాలి పటానికి తోక పెట్టు. అంగుళం వెడల్పుతో తోక ఓ రెండు అడుగులుండాలి" అంటించాడు.

"ఇప్పుడు ఓ కష్టం పని ఉందిరా, సూత్రం కట్టాలి. దారం తీస్కురా, గట్టి నూలు దారం కావాలి అన్నాను. మంచి దారం ఉండ తెచ్చాడు వాడు.

గాలి పటాన్ని వెనక్కి తిప్పి, పుల్లతో సరైన చోట్ల నాలుగు చిల్లులు చేసి, వాటి గుండా పోయేట్లు దారం కట్టా, లెక్కగా పైన ముడి వేశా. "సూత్రం కట్టటం అందరికీ బాగా రాదు. సూత్రం బాగా కడితే గాలిపటం తోక లేకుండా కూడా ఎగురుతుంది" చెప్పా.

"మరిప్పుడు "మాంజా" తేనా?" అడిగాడు అభి.

'మాంజా' అంటే?" అడిగా.

"మంచి దారంలే; అదివ్వనా?" అని పోయి పెద్ద కండెడు దారం తెచ్చాడు వాడు. రకరకాల లావుల్లో, రకరకాల గట్టి దనాలతో, మెత్తగా-గరకుగా రకరకాలుగాఉన్నదది!

"ఓరి! ఇంత దారం ఉందే, నీ దగ్గర!" ఆశ్చర్యపోయా.



"మరేమనుకున్నావు, గాలిపటాలు ఎగరెయ్యాలంటే 'మాంజా' కావాలిగా మరి! రా, ఇప్పుడు మనం మేడమీదెక్కి ఎగరేద్దాం" అన్నాడు వాడు, గొప్ప నిపుణతతో గాలిపటానికి దారం కడుతూ.

నిజానికి వాడికి నాకంటే బాగా వచ్చు- గాలిపటం ఎగరెయ్యటం.

చాలా చక్కగా ఎగరేశాడు. చూస్తూ చూస్తూండగానే గాలిపటం ఆకాశంలోకి ఎత్తుగా ఎగిరింది.

"దారాన్ని నా చేతికి ఇయ్యిరా కొంచెం" అన్నాను .

చేతికి ఇచ్చినట్లే ఇచ్చి "ఖీంచ్ ఖీంచ్" అరిచాడు వాడు-

బిత్తరపోయి చూశా.

వాడు నా చేతిలోంచి గబుక్కున దారాన్ని తన చేతిలోకి తీసుకొని లాగుతూ, "గాలిపటం పడిపోతున్నా, గుండ్రగా తిరుగుతున్నా దారాన్ని లాగాలి" అన్నాడు.

"ఓహో, 'ఖీంచ్' అంటే అర్థం అదా?" నవ్వాను.

"ఢీల్ ఢీల్" అంటే దారం వదలాలి. అప్పుడు గాలిపటం ఇంకా దూరం పోతుంది" చెప్పాడు. "ఖీంచ్ ఖీంచ్...ఢీల్...ఢీల్...ఢీల్.." వాడిసూచనల ప్రకారం పట్టుకొని లాగుతూ వదుల్తూ పోతే, గాలిపటం బలే ఎగిరింది!

తర్వాత నా దగ్గరినుండి దారం తీసుకొని తనే గాలిపటం ఎగరేస్తూ కూడా "ఖీంచ్ ఖీంచ్..ఢీల్ ఢీల్" అని అరుస్తూనే ఉన్నాడు వాడు.

వాడి సంతోషపు కేకలు వింటూంటే ఓ క్షణాన అనిపించింది-"మన జీవితం నిజంగానే, ఒక గాలిపటం లాంటిది. ఒక్కోసారి దాని మీద పట్టు బిగించి, లాగి- దాని దిశనూ, వేగాన్నీ నియంత్రించాలి. ఒక్కోసారి దాన్ని వదలాలి, ప్రవహించనివ్వాలి, దానితో బాటూ మనమూ ప్రవహించాలి. మన చదువుల్లోనూ, పరీక్షల్లోనూ- అన్నింటా ఈ సంగతి గుర్తుంచుకోవాలి- ఎప్పుడూ బిగపట్టుకోనూ కూడదు, అట్లా అని ఎప్పుడూ బలాదూరుగా ఉండనూ కూడదు. ఎప్పుడు ఏది అవసరమో గుర్తించుకుంటూ అప్పుడు ఆ పని చేయాలి" అని.

మీరేమంటారు?

నవ్వు!

**కాపీ తెలివి!**

టీచర్: పిల్లలూ! డ్రైవింగ్ చేసే వాడిని డ్రైవర్ అంటారు, ప్రింటింగ్ చేసే వాడిని ప్రింటర్ అంటారు. మరి డ్రాయింగ్ వేసే వాడిని ఏమంటారు పిల్లలూ?

రాజేష్: డ్రాయర్ అంటారు టీచర్.




# నీతి చంద్రిక

సంధి-9

*మేఘవర్ణుడనే కాకి చిత్రవర్ణుడనే నెమలిరాజుకు 'మోసపోయిన బ్రాహ్మణుడి కథ'చెబుతున్నది. బ్రాహ్మణుడినుండి ఆవును ఎలాగైనా దొంగిలించాలని పథకం వేస్తున్న ముసలి దొంగ తన తోటి వారికి కోతి-మొసలి కథ, అందులో భాగంగా తాబేలు-నక్క కథ చెబుతున్నాడు- తాబేలును పట్టుకున్న నక్క, దాన్ని తినేందుకు ఎక్కడాలేని తంటాలు పడింది. తెలివైన తాబేలు దానికో ఉచిత సలహా ఇచ్చింది. అప్పుడేమైందో చదవండి- నీతిచంద్రిక 56 వ భాగం...*

తాబేలు తియ్యగా పలికిన ఆ మాటల్ని నిజమనుకున్నది నక్క. 'నేను మోపిన కాలు వల్లనే తాబేలు సరిగ్గా నానలేకపోతున్నది' అనుకున్నది. అట్లా అనుకొని, దాని వీపు మీది నుండి తన కాలి బరువును కొద్దిగా సడలించింది. మరుక్షణం తాబేలు కదిలింది- ప్రాణాలు దక్కించుకొని, ధనుస్సునుండి వదిలిన బాణం మాదిరి తటాలున సరస్సులోపలికి జారిపోయింది.

మొసలికి ఈ కథ చెప్పి, కోతి అన్నది- "ఓ తెలివిలేని మొసలీ! మోసాలన్నిటికీ కాణాచి అయిన నక్కే ఆ విధంగా మోసపోగా లేనిది, నీలాంటి పుట్టు గ్రుడ్డి మోసపోవటంలో ఇక

ఆశ్చర్యం ఏమున్నది? అయినా, ఇప్పటికి అయ్యింది చాలు చాలు- నీతో స్నేహం చేసినందుకు తగిన శాస్తి త్వరగానే జరిగింది. ఇంక నీ స్నేహాన్ని నీ దగ్గరే ఉంచుకో.



నిజానికి, ఒకప్పుడు నా శక్తి సామర్థ్యాలకు ప్రపంచంలో చాలా పేరు ప్రఖ్యాతులుండేవి. అయినా దైవం అనుకూలించక, నా రాజ్యాన్ని, మర్యాదను కోల్పోయి, శత్రువులతో వేగలేక, భార్య-బిడ్డలు-కుటుంబ సౌఖ్యం పట్ల, బంధువుల పట్ల విముఖుడినైపోయి, నా సొంత ఊరిని విడిచి వచ్చి, నిలువ నీడలేక, త్రాగ నీరు లేక ఏకాకినై అడవులు పట్టి తిరిగి తిరిగి చివరికి ఈ చెట్టును చేరుకొని, తనంతట తాను లభించే ఆహారాన్ని ఏరుకొని తిని- అలా కడుపు నింపుకుంటూ, కులాన్నీ-గోత్రాన్నీ-పేరునూ అన్నీ దాచుకొని మొన్నటి దాకా కాలం గడుపుతూ వచ్చాను. తర్వాత అన్నేళ్లకు నీ పెద్దతనాన్ని చూసి, నా బుద్ధి గడ్డితిన్నది- నువ్వింత 'మిత్ర వంచకుడివి' అని తెలుసుకోలేకపోయాను- నీతో స్నేహానికి అంగీకరించాను. ఇక నువ్వు పాపాత్మురాలైన నీ భార్య దుర్బోధవల్ల మతి చెడి, మోసపు ఉపాయంతో నన్ను మట్టుపెట్టాలనుకొని, నంగనాచిలాగా 'మా ఇంట్లో విందు ఆరగిద్దువు రా' అని నచ్చికబుచ్చికలాడితే, నేను అందులోని మోసం తెలీక, నీ మందిరంలో స్థిరంగా సుఖంగా తలదాచుకోవచ్చని నమ్మకంతో, అంతులేని సంతోషంతో బయలుదేరి వచ్చాను. అయినా నా అదృష్టం బాగుండటం చేత మార్గమధ్యంలో నీ ఆకారవికారాలను గమనించి, నీ మనసులో

కదలాడుతున్న వికారాలను ఊహించ-గల్గాను. నా పూర్వ పుణ్యంకొద్దీ ఈ ఉపాయం తోచింది గనక, ఇలా పులి నాకి విడిచిపెట్టినదాని లాగా బ్రతికి మాట్లాడ-గల్గుతున్నాను.

ఇంట్లో ఉండి లోకం తెలీకుండా బ్రతికే ఆడవారికి మంచి ఏమిటో తెలీదు; చెడు ఏమిటో తెలీదు. కేవలం మాయోపాయాలు పన్ని తమ పట్టును సాధించుకోజూస్తారు. నువ్వు నాతో స్నేహం చేసి ఇల్లు పట్టనట్లు ఉండిపోయేసరికి, ఏదో ఒక విధంగా నన్ను చంపిస్తే చాలునని నీ భార్య పన్నిన పన్నాగమే కావచ్చు, ఇదంతా. ఈ శరీరాలదేమున్నది- ఇవి కేవలం నీటి బుడగలవంటివి. యవ్వనం కేవలం నురుగులాంటిది. సంపద అన్నది మెరుపు లాగా చంచలమైనది. అలంకారాలన్నీ గోడమీది బొమ్మలలాంటివి. భార్యాబిడ్డలు స్మశానం వరకు మన వెంట రాగలరేమోగానీ, అటుపైన మన వెంట రారు- ధర్మం ఒక్కటే, అనునిత్యం మన వెంట వచ్చేది; మనల్ని కాపాడేది. అయినప్పటికీ, నువ్వు నాతో శత్రుత్వాన్నీ లెక్కించలేదు; ధర్మాధర్మాలనూ లెక్కించ-లేదు- క్షణభంగురమైన ఈ శరీరాన్ని నమ్ముకొని, కీర్తిశరీరాన్ని తృణీకరించావు; శాశ్వతమైన అపఖ్యాతిని మూట-గట్టుకున్నావు. ప్రాణాధికుడైన మిత్రుడినే ఇట్లా చేసిన పరమ సాహసికుడివే, నువ్వు! నీకు ఇక ఇతరులంతా గడ్డిపోచలతో సమానం కాబోలు! ఇక మీద నీ గతి ఎట్లా కానున్నదో, ఎవరికేమి ఎరుక? నీలాంటి మిత్రద్రోహిని చూసినంత మాత్రాన పాపం తగులుకుంటుంది. ఇంక నువ్వు నా ముందు నిలబడి నన్ను ఇంకా రెచ్చగొట్టకు-వేవేగనే ఇంటి త్రోవ పట్టుకొని పో!" అని ముక్కూ-ముఖం చూడకుండా తిట్టి, జవాబు ఇచ్చేందుకు నోరు పెగలకుండా చేసి, ఆ మొసలిరాజును అక్కడినుండి సాగనంపింది. క్రకచం కూడా నీరసపడిపోయి, దిక్కులు చూస్తూ వట్టి చేతులతో తన ఇంటి త్రోవ పట్టింది.

-కాబట్టి మోసంతోఎట్లాంటి పనినైనా సాధించవచ్చు. నా మీద దయ ఉంచి మీరంతా నాకొక్క సహాయం మటుకు

చెయ్యండి. మీరంతా ముందుగా పోయి, ఆ బ్రాహ్మణుడు వెళ్ళే దారిలో దూర దూరంగా నిలబడి, ఏవేవో పనులు చేస్తున్నట్లు నటిస్తూ ఉండండి- అతను మీకు దగ్గరగా పోయేటప్పుడు అతన్ని నిలబెట్టి, "అయ్యా! విప్రోత్తమా! నల్లకుక్కను ఎందుకు తీసుకుపోతున్నారు?" అని అడగండి- మీరు ఇంతమాత్రం తోడ్పడ్డారంటే చాలు, మిగిలిన పనిని నేను చక్క పెడతాను" అని ఆ ముసలిదొంగ తోటి మోసగాళ్లతో అన్నాడు.



'సరే' అని వాళ్లంతా బ్రాహ్మణుడికి కనబడకుండా దాటుకొని పోయి, అతను వచ్చేదారిలో అక్కడక్కడా ఒక్కొక్కడు చొప్పున కూర్చున్నారు.

అంతలోనే బ్రాహ్మణుడు మేకపోతును ఈడ్చుకొని మొదటి దొంగ ఉన్న తావునుండి పోబోయాడు. అప్పుడు వాడు బ్రాహ్మణుడికి నమస్కారం పెడుతూ "అయ్యా! మీరు చూస్తే ఎవరో గొప్ప బ్రాహ్మణులలాగా ఉన్నారు; మరి ఈ నల్ల కుక్కను ఎందుకు ఈడ్చుకుపోతున్నారు స్వామీ?" అని అడిగాడు. దానికి ఆ బ్రాహ్మణుడు కళ్ళతో నిప్పులు కురిపిస్తూ "ఛీ ఛీ! త్రాగుబోతా! అసహ్యంగా మాట్లాడకు! నేను యజ్ఞం కోసం తీసుకువెళ్తున్న ఈ పవిత్రమైన మేకపోతును 'కుక్క' అనేందుకు నీకు నోరెలా వచ్చిందిరా?! పో! పో" అని అతని మాటలను లక్ష్యపెట్టక తన దారిన తాను ముందుకు సాగాడు.

అతను అలా నాలుగడుగులు ముందుకు పోయాడో లేదో, రెండో దొంగ ఎదురయ్యాడు. అతను బ్రాహ్మణుడికి చేతులు మోడ్చి నమస్కరిస్తూ "స్వామీ!

మీరు సర్వమూ తెలిసిన వారు కదా?! అంత గొప్పవారు, సిగ్గు విడచి ఈ నల్లకుక్కను ముట్టుకుంటున్నారేమి?" అని అడిగి అతని సమాధానం కోసం ఎదురు చూడకనే చక్కా పోయాడు. దాంతో బ్రాహ్మణుడికి మనసులో కొంచెం అనుమానం వచ్చింది- అయినా మారు మాట్లాడక మేకను పట్టుకొని ముందుకు పోయాడు.



అంతలోనే మూడో దొంగ ఎదురుపడి "ఇదేమి పోయేకాలం బాపనయ్యా?! ఇంత అక్రమానికి ఒడిగట్టావే? నువ్వెత్తింది బ్రాహ్మణ జన్మం కదా? అయినా సుగుణాన్నీ, శీల సంపత్తినీ ప్రక్కన పెట్టి, లోకులంతా నవ్వేట్లు, అపవిత్రమైన ఈ కర్రికుక్కను నేరుగా రాజమార్గాన్నే ఈడ్చుకొని పోతున్నావేమి? ఈ రాజ్యం ఏం పాపం చేసుకున్నదయ్యా, కులాచారాలు, ధర్మం ఇలా మంటకలిసిపోతున్నాయి?" అని వదరి పోయాడు.

దాంతో ఆ బ్రాహ్మణుడి మనస్సు వికలమైపోయింది. అనుమానంతో అతని హృదయం కొట్టుమిట్టాడగా "ఒకరిద్దరు కాదు-చూసిన వాళ్లంతా దీన్ని 'కుక్క' అంటున్నారేమి? ఒకవేళ నాకే ఏమైనా మతి భ్రమించలేదు గద?! కుక్కను చూసి నేను మేక అనుకుంటున్నానా? ఈ పరిస్థితి నాకు ఎందుకు వచ్చి ఉంటుంది?" అని విచారంతో ఆలోచనామగ్నుడై, కాలు ముందుకు సాగక అక్కడే నిల్చుండిపోయాడు.

మొదటినుండి బ్రాహ్మణుడిని వెంబడిస్తూ వస్తున్న ముసలి దొంగ తన ప్రయత్నం ఫలించనున్నది గదా అని సంతోషిస్తూ, బ్రాహ్మణుడికి వినబడేట్లు తన తోటిదొంగతో

"ఒరే, చూసావా? పాపం అమాయకుడైన ఈ బ్రాహ్మణుడిని వెర్రివాడిని చేసి, ఎవరో అంట్లకుక్కనొకదాన్ని ఇతనికి కట్టబెట్టారు. ఇప్పుడు చూడు, ఇతని దురవస్థ!" అని ఆ బ్రాహ్మణుడి తెలివిలేమిపై జాలి చూపిస్తున్నట్లు అని, అటుపైన వెటకారంగా వికవికా నవ్వాడు.



ఆ మాటలు విన్న బ్రాహ్మణుడు తన స్వీయ అనుభూతిని ఒక్కపాటుగా ప్రక్కన పెట్టేసి, 'ఇంతమంది ఒకేలాగా చెప్పిన మాట అబద్ధం కాదు' అని నిశ్చయించుకున్నాడు: తన తప్పిదానికి లోలోపలే నొచ్చుకున్నాడు; కుంచించుకుపోయాడు.

తన వెంటఉన్న యజ్ఞపు మేకను అక్కడే విడచిపెట్టి, మళ్ళీ వెనక్కిపోయి, చెరువులో స్నానంచేసి, పరిశుద్ధుడై, తడిబట్టలతో ఇల్లు చేరుకొని, పాప పరిహారం కోసం గాయత్రీ మంత్రం జపించుకుంటూ కూర్చున్నాడు. కొలను ఒడ్డున చేరిన దొంగలు నలుగురూ అతను వదిలిపెట్టిన మేకపోతును పట్టుకొని, బాపని వెర్రిని తలచుకొని కడుపారా నవ్వుకున్నారు.

(తర్వాత ఏం జరిగిందో వచ్చేమాసం...)

**అధిక భక్తి!** నవ్వు!

నరేష్: ఒరేయ్ రామూ! నువ్వేమీ చదవలేదు కదా! పరీక్ష ఎలా రాస్తావు?

రామూ: టెన్షన్ పడకు! నా అట్ట మీద సరస్వతీ దేవి ఉంది కదరా, అన్నీ ఆమే చూసుకుంటుంది.



# ఉక్కు మనిషి

*రచన: పి. హర్ష వర్ధన్ రెడ్డి, ఏడవ తరగతి, జడ్.పి.హెచ్.యస్. స్కూల్, సి.కె.పల్లి*

ఊరి మధ్యలో అందరూ గుమిగూడి ఉన్నారు. వారిలో పిల్ల-పెద్ద, ముసలి-ముతక, ఒక్కరేమిటి- అందరూ ఉన్నారు. ముక్కు పచ్చలారని ఒక ఏడేండ్ల పిల్లాడు వాళ్ళందరి మధ్యలో నిలబడి ఉన్నాడు. వాడి కాలుకు ఒక గుల్ల ఉంది. దాని ప్రభావం వల్లనేనేమో, మరి ఆ పిల్లవాడి కాలు ఏనుగు కాలులాగా ఉబ్బి ఉన్నది. అక్కడే ఉన్న వైద్యుడు ఒకడు ఆ ప్రక్కనే నిప్పుల్లో కాలుతున్న ఎర్రని కడ్డీ వైపు, పిల్లవాడి కాలు వైపుకు మార్చి మార్చి చూస్తున్నాడు.

ఇంతకీ అక్కడ జరగబోయేదేమిటంటే, ఎర్రగా కాలుతున్న కడ్డీతో వైద్యుడు ఆ పిల్లవాడి గుల్లను కాల్చాలి. అంత చిన్న ఆ పిల్లవాడు అంత మంటని ఓర్చుకోవాలి.

కడ్డీని పిల్లవాడి కాలు మీద పెట్టడానికి ఆ వైద్యుడికి ధైర్యం చాలట్లేదు. చూసే వారికి కూడా భయంగా ఉంది- 'పాపం'

అనిపిస్తున్నది.

పిల్లవాడు ఏడవటం లేదు. భయంతో వణికి పోవట్లేదు. చికాకు పడుతున్నాడు- ఆలస్యాన్ని భరించలేకపోతున్నాడు- "అయ్యా! నా స్నేహితులు నాకోసం ఎదురు చూస్తుంటారు. నేను వెళ్లి ఆడుకోవాలి. మీ పని తొందరగా కానిస్తే, నేను వెళతాను-" అని వైద్యుడినే తొందర పెడుతున్నాడు! 'వీడికి తెలీదు-కాల్చటం అంటే ఏదో తీపి తినిపించటం అనుకుంటున్నట్లున్నాడు' అనుకుంటున్నారు చుట్టూతా ఉన్న పెద్దవాళ్ళు వాడి మీద జాలిపడుతూ.

పిల్లవాడు ఎంత చెప్పినా వైద్యుడికి మటుకు ధైర్యం చాలలేదు. 'పసివాడు తట్టుకోలేడు' అన్న జాలి అతని హృదయాన్ని మెత్తబరుస్తున్నది.

ఆ పిల్లవాడు కొంత సేపు చూసాడు. తర్వాత చటాలున నిప్పుల్లోంచి ఆ కాలుతున్న కడ్డీని తీసి తానే స్వయంగా తన కాలి గుల్లమీద పెట్టుకున్నాడు. అందరూ భయంతో కళ్ళు మూసుకున్నారు. గుల్ల పగిలి రక్తం, చీము లొడ-లొడా కారాయి! అందరూ బాధగా కళ్ళుమూసుకొని ఉంటే, ఆ పిల్లవాడు మటుకు 'నా గుల్ల పగిలింది' అంటూ పల్లటీలు కొట్టాడు. గుమిగూడిన వాళ్లనందరినీ నెట్టుకొని రివ్వున ఆటకు పరుగుపెట్టాడు!

ఇంతకీ ఆ ధైర్యశాలి బాలుడు మరెవరో కాదు- ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధుడు, మన తొలి హోంశాఖామాత్యుడు, ఉక్కుమనిషి గా పేరొందిన 'సర్దార్ వల్లభభాయ్ పటేల్'. ఆనాటి వరకూ అనేక చిన్న చిన్న రాజ్యాలుగా విడిపోయి ఉన్న మన దేశాన్ని రాచరికం చేతుల్లోంచి తప్పించి సువిశాల, ప్రజాస్వామ్య భారత దేశాన్ని నిర్మించటం వెనుక ఈ ఉక్కుమనిషి తెగువ ఎంతకైనా ఉన్నది!

చదివి పడేసిన పుస్తకమూ, ఇంకోడి దగ్గర ఉన్న డబ్బూ మన అక్కరకు రావు



# ఐదు వందలు

*బొమ్మల కథ*
*రచన: జి. తిష్య, 3 వ తరగతి, రాధా స్కూల్ ఆఫ్ లెర్నింగ్, అనంతపురం*



ఒక రోజు రాత్రి 7 గంటలప్పుడు అమ్మ నన్ను గ్రుడ్లు తెమ్మని బయటికి పంపింది.



నేను గ్రుడ్లు కొనుక్కొని వెనక్కి వస్తుంటే ఒక ఇంటి ముందు నోటు ఒకటి పడి కనిపించింది. చూడగా అది ఐదువందల రూపాయలు!



నేను ఆ నోటును పట్టుకొని అటూ ఇటూ చూశాను. అక్కడికి దగ్గర్లోనే అడుక్కునే అవ్వ ఒకతె కూర్చొని ఉండింది. నేను ఆమె దగ్గరికెళ్ళి "అవ్వా! నీ డబ్బులు ఏమైనా పోయాయా?" అని అడిగాను.

"లేదు తల్లీ! నా దుడ్లు నాదగ్గరే ఉన్నై" అన్నదా అవ్వ.



"సరేలే అవ్వా! నాకు ఇక్కడ ఓ నోటు దొరికింది. ఎవరైనా దానికోసం వెతుక్కుంటూ వస్తే మా ఇంటికి రమ్మని చెప్పు" అని ఆ అవ్వకు మా అడ్రస్ ఇచ్చాను నేను.

ఇంటికి వచ్చాక అమ్మకు విషయం అంతా చెప్పాను. "ఒక వారం రోజులు చూద్దాం; అయినా దానికోసం ఎవ్వరూ రాకపోతే తీసుకెళ్ళి అనాథాశ్రమంలో ఇచ్చేద్దాం" అన్నది అమ్మ.



రెండు రోజులు గడిచాక చాకలి ఆమె ఒకామె మా యింటికి వచ్చింది: "అమ్మా! ఆ డబ్బు నాదేనమ్మా" అంటూ.

"ఎన్ని రూపాయలు?" అడిగాను నేను.

"ఐదు వందల నోటమ్మా! అవ్వ కూర్చుని ఉంటుందే, ఆ తెల్ల మేడలోనేనమ్మా, నేను పని చేసేది! నెలంతా బట్టలు పిండుతాను కదా, అందుకని మొన్న సాయంత్రం ఆ ఇంటి వాళ్ళు ఐదు వందలిచ్చారు. ఇంటికెళ్ళి చూస్తే లేనే లేదు; ఎక్కడ పోగొట్టుకున్నానో తెలీదు! చాలా బాధ పడ్డానమ్మా! చివరికి ఇవాళ్ళ అవ్వనడిగితే చెప్పింది-" అన్నది చాకలామె.

"సరేలే! ఈ నోటు నీదే! తీసుకెళ్ళు!" అన్నాను నేను, అమ్మనడిగి నోటు తెచ్చిస్తూ.





ఆమె ముఖం సంతోషంతో వెలిగిపోయింది. "వేరే పిల్లలకు ఎవరికి దొరికినా నాకు తిరిగి ఇచ్చేవాళ్ళు కాదు- నువ్వు చాలా మంచిదానివమ్మా! నా డబ్బును నాకు ఇచ్చావు. ఇంద- ఇది తీసుకొని నీకు నచ్చిందేదైనా కొనుక్కో" అంటూ తన దగ్గరున్న డబ్బుల్లోంచి యాభై రూపాయలు ఎంచి నాకు ఇవ్వబోయిందామె.



నాకు చాలా సంతోషంగాను, తృప్తిగాను అనిపించింది. అమ్మకేసి చూస్తే "వద్దు-తీసుకోకు" అన్నట్లు తల అడ్డంగా ఊపింది. నేనన్నాను "నీ డబ్బులు నీకు దొరికినాయి- అంతే చాలు. నాకేమీ అక్కర్లేదు" అని.

చాకలామె వెళ్ళాక, నేను చాలా సంతోషంగా ఉండటం చూసి అమ్మ అన్నది: "చూశావా! నీతిగా నిజాయితీగా ఉండటం వల్ల ఎంత సంతోషం కలుగుతుందో?" అని.



# గుడ్డాయన - గూనాయన

తెలుగు జానపద కథ

*సేకరణ: యన్. సిద్ధార్థ, మండల ప్రాథమిక పాఠశాల, పూజారివారి పల్లి, చిత్తూరు జిల్లా.*

ఒకసారి ఒక గుడ్డాయన, ఒక గూనాయన మాట్లాడుకుంటూ నడుస్తున్నారు ఓ అడవిలో.

అడవిలో క్రూర మృగాలు చాలానే ఉన్నాయి. వీళ్ళిద్దరికీ ఆ సంగతి తెలుసు. అయినా అవసరం కొద్దీ పొరుగూరికి బయలు దేరారు. మధ్యలో ఈ అడవిని దాటాలి- ఆ సరికే సాయంత్రం కావొస్తున్నది. ఇద్దరికీ మనసులో కొంచెం కంగారుగానే ఉన్నది.

అంతలో ఏదో రాయి అడ్డం వచ్చింది- గుడ్డాయనకు అది కనపడలేదు. పాపం అతను ఆ రాయికి దొందురుకొని క్రింద పడ్డాడు. బాధతో మూలిగాడు. శ్రమపడి కూర్చోగలిగాడు గానీ, ఇక నడవటం కష్టం అయ్యింది. చూడగా కాలికి కొంచెం గట్టి గాయమే అయ్యింది-

"చాలా నొప్పిగా ఉందిరా; ఇంక నడవలేను" అన్నాడు అతను స్నేహితుడితో. "అయ్యో! పర్లేదులే, నువ్వు నా వీపుమీద ఎక్కి కూర్చో. నేను నిన్ను మోయగలను- ఏం కాదు"

అన్నాడు గూనాయన.

'సరే' అని గూనాయన వీపుమీది ఎక్కి కూర్చున్నాడు గుడ్డాయన.

గూనాయనది అసలే నడుము సమస్య. ఆ పైన ఇప్పుడు గుడ్డాయన బరువు. అలాగే కష్టపడి నడవసాగాడు. అంతలో అతని కాలికో కొబ్బరి మట్ట తగిలింది. నడక తీరు మారటం చూసి 'ఏంటది?' అని అడిగాడు గుడ్డాయన.

"కొబ్బరి మట్ట" అన్నాడు గూనాయన. "ఏదీ, కొంచెం అది అందివ్వు- పనికి వస్తుంది" అన్నాడు గుడ్డాయన. గూనాయన శ్రమపడి కొబ్బరి మట్టను తీసి అందించాడు.

మళ్ళీ ప్రయాణం మొదలైంది.

కొంతసేపటికి గూనాయన కాలికి ఒక కుండ తగిలింది.

'ఏంటది?' అడిగాడు గుడ్డాయన.

'ఏదో ఖాళీ కుండ' చెప్పాడు గూనాయన.

"నా తల ఎలాగూ ఖాళీయే! కుండని ఇటివ్వు; తలకు తగిలించుకుంటాను" అన్నాడు గుడ్డాయన. గూనాయన కుండని ఇస్తే గుడ్డాయన దాన్ని తన తలకు తగిలించుకున్నాడు.

మళ్ళీ నడక మొదలైంది. ఈసారి ఓ పొడుగాటి వెదురు బొంగు దొరికింది వాళ్లకు. గుడ్డాయన దాన్నీ తీసి చేతిలో పట్టుకున్నాడు.

ఆసరికి పాపం గూనాయన చాలా అలిసిపోయాడు. చీకటికూడా పడబో-తున్నది. దగ్గర్లోనే అతనికో కొండ గుహ కనిపించింది.

"గుహలో ఆగుదామా?" అన్నాడు అతను గుడ్డాయనతో.

"ఓసారి చూడు. అందులో జంతువులు ఏమైనా నివాసం ఉంటాయేమో" అన్నాడు గుడ్డాయన.

గుహ శుభ్రంగా ఉంది.

ఇద్దరూ గుహలో విశ్రాంతిగా కూర్చున్నారు.

నిజానికి ఆ గుహ ఓ సింహంది. ఆ సింహం అంతకు ముందు ఓ సర్కస్‌లో పనిచేసి, పారిపోయి అడవికి చేరుకున్నది; అట్లా దానికి మనుషులు ఎంత ప్రమాదకారులో తెలుసు. (అంతేకాక దానికి తెలుగు కూడా

బాగానే వచ్చు!)

ఇంకా గుహలోకి రాకనే అది వాసన పట్టింది: "ఎవరో మనుషులు!" ఆ వెంటనే దానికి చాలా భయం వేసింది.

"ఎవరది?! ఎవరు నా గుహలో దూరింది?! ఎవరికి, అంత ధైర్యం?!" అని పెద్దగా గర్జించింది సింహం.

గుడ్డాయనకి, గూనాయనకి గుండెలు చెదిరిపోయాయి. అయితే గుడ్డాయన కొంచెం ముందుగా తేరుకున్నాడు: "చూడు, దీనికి మనం భయపడ్డట్లు తెలీకూడదు. తెలిసిందంటే ఇక మనం ఉండం!" అన్నాడు.

గూనాయన కొంచెం ఆలోచించుకొని ధైర్యంగా "ఎవర్రా అది, మమ్మల్నే అడిగేవాడెవడు?! నీలాంటి వంద సింహాల పెట్టురా, ఈ శరభం! మర్యాదగా తోక ముడిచావంటే సరి. కాదంటావా, ఇక నీ పని ఇవ్వాల్టితో ఆఖరు!" అని అరిచాడు గుహ లోపలినుండే.

"నాకన్నా పెద్ద జంతువు ఏదీ లేదు. నేనే అడవికి రాజును! నువ్వు నాకంటే పెద్ద జంతువువైతే నాకేదైనా గుర్తు చూపించు, దమ్ముంటే బయటికి రా!" అన్నది సింహం, "ఏ మనిషి బయటికి వస్తాడో!" అని కొంచెం భయపడుతూనే.

వెంటనే గుడ్డాయన తన చేతిలోని కొబ్బరి పట్టను గుహలోంచి బయటికి చాపాడు: "నా కొమ్ము చూడురా, చూసి వెనక్కి తిరిగి చూడకుండా పో" అరిచాడు, సింహం దాన్ని చూసీ చూడకనే గబుక్కున లోపలికి లాక్కుంటూ.

అంత భయంకరమైన కొమ్మును చూసి సింహానికి భయం వేసింది. అయినా మొండిగా, "ఓస్, దీనిదేముంది, నీ చెయ్యి ఎంత పెద్దదో చూపించు!" అంది.

మరుక్షణం గుడ్డాయన తన చేతిలోని వెదురుకట్టెతో గుహ బయట కూర్చున్న సింహాన్ని ఒక్క తోపు తోశాడు. దాని తాపుకు పిరికి సింహం అంత దూరం వెళ్ళి పడ్డది. అది తేరుకునేంతలో వెదురు కట్టె మళ్ళీ గుహలోకి చేరుకున్నది- "హహ్హహ్హ! నా గోరుతో ముట్టుకుంటేనే అంత దూరం వెళ్ళి పడ్డావు, నీతోటి నాకేమి! మర్యాదగా పో, నా

నిద్ర చెడగొట్టకు" అరిచాడు గుడ్డాయన లోపలినుండి.

"నీ అరుపొక్కటీ వినిపించు. అది నా గర్జన కంటే బలమైనదా?" అంది సింహం, చివరి అస్త్రం మాదిరి. ఆ సరికి దానికి లోపల ఉన్నదెవరో 'భయంకరమైన మనిషి' అని అనుమానం వేసింది.



గుడ్డాయనా, గూనాయనా ఇద్దరూ తమ దగ్గరున్న కుండలోకి "ఘ్రూ...ఘ్రూ... హూ....ఖ్రూ..."అని ఇష్టం వచ్చినట్లు అరిచారు. కుండలోంచి వెలువడ్డ శబ్దం గుహలోంచి ప్రతిధ్వనించి, బయటికి ఘోరమైన గర్జనలాగా వినబడింది.

ఆ అరుపు విని సింహం నీరు కారిపోయింది కానీ, ఇంకా గుహవైపుకే చూస్తూ నిలబడింది.

అంతలోనే గూనాయన మీది కెక్కిన గుడ్డాయన, తలమీద కుండతో, కొబ్బరి మట్ట కొమ్ముతో, వెదురు బొంగు చేతితో, రెండు గొంతులతో అరుచుకుంటూ గుహలోంచి బయటికి దూకి నేరుగా సింహం మీదికే పడబోయాడు!

ఆ సరికే తారుకొని ఉన్న సింహం అదిరిపోయి, వెనక్కి తిరిగి, అడవిలోకి పరుగు లంకించుకున్నది- దానికి మనిషి అంటేనే భయమాయె! "ఇప్పుడు ఇన్ని చేతుల కొమ్ము మనిషి! తను మనుషుల చేతిలో ఇంతకాలం పడిన కష్టాలు చాలు!"

"బ్రతికిపోయాంరా" అనుకున్న గుడ్డాయన, గూనాయన మళ్ళీ గుహలోకి చేరుకొన్నారు. ముళ్ళమీద ఉన్నట్లుగా రాత్రంతా కదలకుండా గడిపి, ఇంకా తెల్లవారకనే అడవి దాటి పరుగు పెట్టారు!

మంచిమాట

కంటికి కన్ను పణంగా పెడుతూ పోతే త్వరలోనే ప్రపంచంలో అందరూ గుడ్డివాళ్లవుతారు




# చేప-లేడి

రచన: కె. శ్యామలి, ఆరవ తరగతి, శ్రీ దివ్య భారతి విద్యాలయం, అనంతపురం.



నల్లమల అడవుల్లో చిట్టి లేడిపిల్ల ఒకటి ఉండేది. హాయిగా గంతులు వేస్తూ అడవిలో ఎక్కడ పడితే అక్కడ తిరిగేదది. ఒకసారి అట్లా తిరుగుతూ తిరుగుతూ అకస్మాత్తుగా అది ఓ నదీ తీరాన్ని చేరుకున్నది.

చిట్టి లేడిపిల్ల అప్పటివరకూ ఏనాడూ నది అన్నదాన్ని చూసి ఉండలేదు. అన్నన్ని నీళ్ళను మోసుకొని బరువుగా ప్రవహిస్తూ పోతున్న నదిని చూస్తే దానికి ఎక్కడ లేని ఉత్సాహం వచ్చింది. అది నదిలోకి దిగి కాళ్ళు కడుక్కున్నది, మునిగి లేచింది, అటూ ఇటూ గెంతింది, కొంచెం దూరం కొట్టుకుపోయింది, మళ్ళీ తేరుకొని బయటికి ఎగిరి దూకి ముచ్చట పడ్డది.

అట్లా షికార్లు చేస్తుంటే దానికి నీళ్ళలో చక్కని చేప ఒకటి కనిపించింది. అది కూడా చిట్టి లేడిపిల్లను చూసి చాలా సంతోష పడ్డది. నీళ్లలో నుంచి పైకి ఎగురుతూ, కిందికి

పడుతూ విన్యాసాలు చేసింది. "ఏ..య్! చిట్టి పిల్లా! నీళ్ళతో జాగ్రత్త! ఒడ్డుకు దగ్గరగానే ఉండు- నదిలో లోపలికి పోకు! సుడిగుండాలుంటాయి!" జాగ్రత్తలు చెప్పింది.

చిట్టి లేడి పిల్లకు నది నచ్చింది, చేప ఇంకా చాలా నచ్చింది. చేప విన్యాసాలను చూస్తూ చూస్తూ, గంతులు వేయటం కూడా మరిచిపోయిందది.

దానికి చేపతో స్నేహం చేద్దామనిపించింది. అలా అనుకున్నదే తడవు, చేపతో తన మనసులోని మాటను చెప్పింది.

"అమ్మో! భూమి మీద తిరిగే లేడిపిల్లతో స్నేహమా? ఇంకేమైనాఉందా?!" ఆలోచించింది చేప. "నువ్వేమేం తింటావు?" అడిగింది జింకను.

"గడ్డి, చిగుర్లు, కాయలు.." అంది జింక.

"మాంసం తినవు కదా?" అడిగింది చేప.

"ఊహు. తోడేళ్లయితే తింటాయి. నాకు అవంటే భయం" చెప్పింది జింకపిల్ల.

"అయితే సరే, మనిద్దరం ఇవాల్టి నుండి స్నేహితులం. నాకు తోడేళ్ళంటే భయం లేదుగానీ, కోరపళ్ళ చేపలంటే మటుకు చాలా భయం" అన్నది చేప.

అంతలోనే అకస్మాత్తుగా ఎక్కడినుండో ఊడిపడిందొక తోడేలు! మెల్లగా అడుగులు వేసుకుంటూ జింకపిల్ల వైపుకు రాసాగింది.

అయితే ఆ సమయానికి జింకపిల్ల తోడేలును చూడటం లేదు- దాని చూపంతా నీళ్ళలో చక్కని చేప వైపుకు దూసుకువస్తున్న కోరపళ్ళ పెద్ద చేప మీదనే ఉన్నది!

ముందుగా తోడేలును చూసిన చేప- "ఏయ్, తోడేలు! పరుగు తియ్యి!" అని అరిచింది.

"ఓయ్! కోరపళ్ళ చేప! నీమీదికే వస్తోంది! పారిపో!" అరిచింది జింక పిల్ల.

చక్కని చేప చటుక్కున నీళ్ళలోకి దూకి ఎటో పోయింది. జింక పిల్ల మెరుపు వేగంతో తమ ఇంటివైపుకు పరుగెత్తింది. కోపంగా దాన్ని వెంటాడిన తోడేలు కొంత సేపటికి నిరాశగా వెనుతిరిగింది.

మరునాడు జింకపిల్ల మళ్ళీ నది దగ్గరికి వెళ్ళి, చక్కని చేపను పిలిచింది- "ఓయ్! మిత్రమా! ఎలా ఉన్నావు? కోరపళ్ళ

చేపనుండి తప్పించుకున్నావా?" అని అడిగింది.

చేప నీళ్ళ పైకి ముఖం పెట్టుకొని విచారంగా ఉన్నది- జింక పిల్లను చూడగానే ప్రాణం లేచి వచ్చినట్లు-



"అబ్బ! బాగానే ఉన్నావా! నీకేమైపోయిందో అని నేను తెగ ఆందోళన పడ్డాను. చూడు, ఎలా జరిగిందో! నీళ్ళలో అయితే నేను నీకు ఏదో కొంచెం సాయం చేసేదాన్ని. కానీ భూమి మీద నేను ఎక్కువసేపు ఉండలేను కదా! నువ్వు ఆపదలోఉన్నప్పుడు నేను ఏమాత్రం ఆదుకోలేకపోయాను. నేను నీకు మిత్రుడిగా సరిపోను" అని బాధపడింది.

"అయ్యో! అదేం మాట! నువ్వు సమయానికి హెచ్చరించకపోతే నేను ఏమైపోయి ఉండేదాన్ని?! నువ్వు నన్ను ఎంత ఆదుకున్నావో నీకేం తెలుసు?" అడిగింది జింకపిల్ల.

"నిజమేలే! నువ్వు నన్ను హెచ్చరించి ఉండకపోతే నా పనీ సరి అయ్యేది!" అన్నది చేప.

"మరింకేమి, ఇద్దరం ఒకరికొకరం సాయపడ్డట్లే! నీకు నేలపై పోరాడగల శక్తి ఉంటే నా దారిన నన్ను వదిలి పెట్టే దానివి కాదు. నీళ్లలో అయితే నన్ను కాపాడే దానివి కదా! నేను కూడా నేలపై నీకు సహాయం చేసి ఉండేదాన్ని. కాబట్టి బాధ పడాల్సింది ఏమీ లేదు. అయినా స్నేహం అనేది లాభ, నష్టాలపై ఆధారపడకూడదు. స్నేహం స్నేహమే!" చెప్పింది జింక పిల్ల.

అటుపైన చేప- జింకల స్నేహం ఎంతో కాలం కొనసాగింది. తమకు వీలు చిక్కినప్పుడల్లా రెండూ కలుసుకొని నీటిలోను, భూమి మీద జరిగే ముచ్చట్లను కథలు కథలుగా చెప్పుకుంటూ సంతోషంగా ఉన్నాయి!




# దయ్యాలతో స్నేహం

*రచన:* G. *దివ్య శ్రీ,* K. *కరీనా అంజుం, ఏడవ తరగతి, అనంతపురం.*

చాలా కాలం క్రితం గద్వాల్ అని ఓ ఊరు ఉండేది. గద్వాల్ ప్రక్కనే ఒక దట్టమైన అడవి. ఆ అడవి పేరే దయ్యాల అడవి! రోజూ రాత్రి ఎనిమిది దాటగానే అడవిలో అంతటా దయ్యాలు నిండుకునేవి. కనబడ్డవాళ్లనల్లా భయపెట్టేవి.

దాంతో రాను రాను ఊళ్ళో జనాలు రాత్రిపూట బయటికి రావాలంటేనే భయపడటం మొదలు పెట్టారు. కొత్తవాళ్ళెవరైనా వస్తే ఊళ్ళోవాళ్ళకు మహా ఇబ్బందిగా ఉండేది. వాళ్లకు ఈ దయ్యాల సంగతి చెప్పనూలేక, చెప్పకుండా ఉండనూ లేక యమయాతన పడేవాళ్ళు. కొందరు గ్రామవాసులు ఆ ఊరు వదిలి వెళ్ళిపోయారు. ఉన్న ఊరు వదలలేక కొందరు, డబ్బులు లేక కొందరు మటుకు అక్కడే ఉండిపోయారు. రాను రాను బయటి వాళ్ళందరికీ ఆ ఊరి సమస్య తెలిసిపోయింది. దాంతో కొత్తవాళ్ళెవరూ ఆ గ్రామానికి రాకుండా తప్పుకు తిరగసాగారు.

ఇలా కొన్నాళ్ళు గడిచాక, ఈ బాధను తట్టుకోలేక ఊళ్ళో ఉన్నవాళ్ళంతా కలిసి మాట్లాడుకున్నారు. "ఏం చెయ్యాలి, దీనికి పరిష్కారం ఏంటి? ఎవరైనా మంచి భూత వైద్యులు వీటిని మట్టు పెట్టగలరా?" అన్నాడు ఊరి పెద్ద.

"ఒకటి రెండు దయ్యాలనైతే భూతవైద్యులు ఏ సీసాలోనో బందీ చెయ్యగలరేమో గానీ, ఇన్ని దయ్యాలను ఎవరైనా ఏం చేయగలరు?" పెదవి విరిచాడు ఊరి పూజారి.

పూజారి అలా అనటంతో చుట్టూ ఉన్నవాళ్ళంతా దిగాలు పడి మౌనంగా ఉండిపోయారు.

అంతలో పూజారి కొడుకు విశ్వేశు "నాకు తెలుసు- దయ్యాలు మనల్ని ఏమీ చెయ్యకుండా ఉండాలంటే ఏం చెయ్యాలో- మనం వాటితో స్నేహం చెయ్యాలి!" అని అరిచాడు.

అంత విచారంలోనూ ఊళ్ళో జనాలంతా నవ్వారు. "దయ్యాలతో స్నేహం చెయ్యాలట!" అని.

అందరూ నవ్వటమైతే నవ్వారు గానీ, నిజంగా ఏం చేస్తే సమస్య దూరమౌతుందో ఎవ్వరికీ తెలీనే లేదు. ఒకరోజంతా ఆలోచించాక, 'ఎవరిదగ్గరా వేరే ఏ ఉపాయమూ లేదు' అని నిర్ధారణ అయ్యాక, పూజారి అన్నాడు- "పిల్లలు భగవంతుడి రూపాలు అంటారు. వీడు చెప్పినట్లు చేసి చూద్దాం. వేరే మార్గం కూడా ఏదీ లేదు గద!" అని. అందరూ తల ఊపారు.



ఆ రోజు రాత్రి ఎనిమిది గంటలకల్లా ఊళ్ళో పెద్ద మనుషులు, పిల్లలు అందరూ బయటికి వచ్చి కూర్చున్నారు.

అంతలోనే దయ్యాలు వికవికమంటూ వచ్చాయి- "ఓయ్! మనుషులు! ఓయ్! మనుషులు!" అని అరుచుకుంటూ.

అయితే అవి త్వరలోనే విపరీతమైన ఆశ్చర్యానికి గురయ్యాయి- వీళ్ళెవ్వరూ తమని చూసి భయపడటం లేదు!

అంతలో పిల్లలు కొందరు ముందుకొచ్చి, దయ్యాలకేసి చూస్తూ ఉత్సాహంగా "ఏయ్!

దయ్యాలూ! మీరు మాతో స్నేహం చేస్తారా?" అని అడిగారు.

దయ్యాలు ఒకదాని ముఖం ఒకటి చూసుకున్నాయి. "మీరు మనుషులు; మేము దయ్యాలం- మరి స్నేహం ఎలా?" అడిగిందో ముసలి దయ్యం.

"దానిదేముంది, నేను రెండో తరగతి, వీడు ఏడో తరగతి. అయినా మేమిద్దరం స్నేహం చేస్తున్నాము కదా, అలాగే" చెప్పాడు సూర్యం.

దయ్యాలన్నీ తలలు ఊపుకున్నాయి. "బాగానే ఉంటుందేమో! మాకూ వేరే ఎవ్వరూ స్నేహితులు లేరు" అన్నాయి కొన్ని. కొంచెం సేపు గందరగోళంగా ఏమేమో చర్చించుకున్న తర్వాత ఒకే గొంతుతో "మేము మీతో స్నేహం చేయడానికి సిద్ధం" చెప్పాయవి.

"సరే, స్నేహం చేద్దామంటున్నారు; చేస్తాం. కానీ అసలు స్నేహం చేయటం అంటే ఏమిటి?" అడిగింది ఒక దయ్యం.

"ఏముంది, స్నేహం చేయటం అంటే ఒకరితో ఒకరు చాలా మంచిగా ఉండటం; వస్తువులు ఇచ్చి పుచ్చుకుంటుండటం, ఎదురయి-నప్పుడల్లా చిరునవ్వు నవ్వటం. 'బాగున్నావా'? అని పలకరించటం-" చెప్పింది కరుణ, ఉత్సాహంగా.

దయ్యాలన్నీ సంతోషంగా తలలు ఊపాయి.

"నేను చాలా మంచిగా ఉన్నానా? నీకేం బహుమతి ఇష్టం? ఇలాగేనా నవ్వేది? బాగున్నారా?" అని గందరగోళంగా మనుషులు, దయ్యాలూ అందరూ ఒకరినొకరు అడుగుతూ గడిపారు ఆరోజు. మనుషులు తమ దగ్గరున్న పళ్ళు, తాము చేసిన వంటకాలు దయ్యాలకు తెచ్చి పెట్టారు. దయ్యాలు తమ దగ్గరున్న బంగారమూ నగలూ తెచ్చి ఇచ్చాయి.

ఇట్లా కొంతకాలం గడిచేసరికి, గద్వాల్‌కు ఇక దయ్యాల బెడద పోయింది.

ఎందుకంటే మనుషులతో స్నేహం చేస్తూ చేస్తూ, పూర్తిగా మనుషుల అలవాట్లు నేర్చేసుకొని, మంచివైపోయాయవి. ఇక ఎవ్వరికీ దయ్యాల బెడద లేనే లేదు!





# మార్చిన పల్లె



*మూలం : సిహెచ్. జయదుర్గ, 7 వ తరగతి, మిర్యాలగూడ, నల్గొండ జిల్లా.*
*మార్పుచేర్పులు: కొత్తపల్లి*

తనవాళ్లంటూ లేని వెంకటికి వారసత్వంగా రెండెకరాల పొలం మటుకు వచ్చింది. అయినా దాన్ని సాగు చేసేందుకు అతని దగ్గర డబ్బుండేది కాదు. ఆ కొద్దిపాటి డబ్బుకోసం అతను, అతని భార్య అంజలీ నానా తంటాలూ పడేవాళ్ళు. భార్యాభర్తలిద్దరూ కూలికి పోయి, ఆ కూలిడబ్బుల్లో కొంత వెనకేసుకొని వాటితో పొలం సాగు చేసుకునేందుకు ప్రయత్నించారు.

ఎంత చేసినా పల్లెలో ఎదుగూ బొదుగూ ఉండేది కాదు. అంతలో ఓసారి కరువు వచ్చి, పొలంలో వేసిన పంటంతా దెబ్బతిన్నది. ఆ దెబ్బతో వెంకటి,అంజలి ఎవరెవరి దగ్గరో అప్పులు చేసి, వడ్డీలమీద వడ్డీలు కట్టి, ఉన్నదంతా పోగొట్టుకున్నారు.

"పట్నం వెళ్ళిపోదాం వెంకటీ, ఇక్కడ ఇక మనకు జరగదు" అంది అంజలి ఓ రోజున.

"నాకూ అదే అనిపిస్తోంది అంజలీ, కానీ పట్నంలో మనకు ఈ వాతావరణం ఉండదు- గాలి బాగుండదు; నీళ్ళు బాగుండవు- అంతా కాలుష్యం. మన బ్రతుకు తీరు పూర్తిగా మారిపోతుందని చూస్తున్నాను" అన్నాడు వెంకటి.

"ఇప్పుడు మన బ్రతుకు సుఖంగా ఏమున్నది గనక? పట్నం పోయి చూద్దాం, అక్కడా జరగక పోతే మళ్ళీ వెనక్కి వచ్చేద్దాం" అంది అంజలి.



అట్లా పట్నానికి వచ్చిన వెంకటి-అంజలి రకరకాల పనులు చేశారు. ఇంటి పనులకు కూలీలుగా పోయారు; ఇళ్ళు కాపలా పనులు, పాత్రలు కడిగే పనులు చేశారు; మెల్లగా పొదుపు చేసుకున్నారు- చిన్న కిరాణా దుకాణం ఒకటి తెరుచుకున్నారు.

కాలం కలిసి వచ్చింది. దుకాణం విస్తరించింది. బాగా డబ్బు వచ్చింది. వెంకటి కాస్తా వెంకటేశ్వర్లు అయ్యాడు. చాలామందికి సాయం చేశాడు. 'గొప్పవాడు' అని పేరు తెచ్చుకున్నాడు. అంతలోనే వాళ్ళకు సాయి పుట్టాడు. భార్యా భర్తలిద్దరూ మురిసిపోయారు. వాడిని ఓ గొప్ప బడిలో చదివించారు. కష్టం తెలీకుండా పెంచారు.

సొంత ఊరంటే ఇష్టం ఉన్న వెంకటి క్రమంగా కలవారిపల్లిలో ఓ ఇరవై ఎకరాల భూమి కొన్నాడు. తమ ఇంటికి కావలసిన బియ్యం, పప్పులు అన్నీ అక్కడే కృత్రిమ ఎరువులు లేకుండా పండించుకునే ఏర్పాట్లు చేసుకున్నాడు.

సాయి పదో తరగతి దాటేసరికి, వాళ్లమ్మ అంజలి ఆరోగ్యం దెబ్బతిన్నది. ఆమెకు మంచి పరిసరాలు, ఆరోగ్యకరమైన వాతావరణం కల్పించటం అవసరం. "సంపాదించింది చాలు. మనం ఈ పనులన్నీ కట్టిపెట్టి ఇక పల్లెకు వెళ్ళిపోదాం" అనుకున్నారు భార్యాభర్తలిద్దరూ.

అయితే సాయికి అది ఏ మాత్రం ఇష్టం కాలేదు. వాడు ఆ ప్రతిపాదనను తీవ్రంగా వ్యతిరేకించాడు. "మీరు వెళ్తే వెళ్ళండి. నేను

మాత్రం పట్నంలోనే ఉంటాను" అని మొండికేశాడు. నిజంగా కూడా వాడివన్నీ పట్నం పోకడలే. తల్లిదండ్రులు పల్లెనుండి వచ్చినా, వీడు ఏనాడూ పల్లె ముఖమే చూసి ఎరుగడు కదా?! పట్నంలో ఉన్న వసతులు, సౌకర్యాలకు అలవాటు పడిన సాయి అవి లేకుండా ఉండే జీవితాన్నే ఊహించుకోలేకపోయాడు.



చివరికి వెంకటేశ్వర్లు-అంజలి వాడు అక్కడే ఉండి చదువుకునేందుకు ఏర్పాట్లు చేసి, వాడిని పట్నంలోనే వదిలి, తాము మాత్రం పల్లెకు తిరిగి వచ్చారు.

ఇప్పుడు వాళ్ళు కలవారిపల్లెలోనే అన్ని వసతులతోటీ ఒక ఇల్లు కట్టుకున్నారు; దగ్గరుండి పంటలు పండించుకుంటున్నారు; కాలుష్యం లేని గాలిని పీలుస్తున్నారు; నిజంగా మంచి నీళ్ళను త్రాగుతున్నారు; ఊళ్ళో జనాలకు ఉపయోగపడే రకరకాల కార్యక్రమాలు చేపట్టారు- అంతా బాగుంది- అంజలి ఆరోగ్యం కూడా మెరుగైంది- కానీ, సాయి మటుకు పల్లెకు రాలేదంటే రాలేదు! అమ్మానాన్నలకు తనకంటే ఎక్కువ ఇష్టమైన ఆ పల్లె అంటే ఎందుకనో, సాయికి చెప్పలేని అయిష్టం ఏర్పడింది! చివరికి వాడికి సెలవలు ఇచ్చినా, తల్లిదండ్రులు కొత్త ఇంట్లో చేరినా, వాడు మాత్రం రాలేదు- పట్నంలోనే ఉండిపోయాడు!

సాయి చదివే కాలేజీకి ఒక రివాజు ఉన్నది. 'తమ విద్యార్థులకు నిజమైన భారతదేశాన్ని చూపించాలి' అని వాళ్ళ విశ్వాసం. అందులో భాగంగా వాళ్ళు ప్రతి ఏడాదీ తమ పిల్లల్ని ఏదో ఒక పల్లెను సందర్శించేందుకు తీసుకెళ్తారు. ముందుగా ఆ ఊరిలో ఉన్న పెద్దమనుషులెవరినైనా సంప్రతించి, అక్కడ రెండు మూడు రోజులపాటు ఉండేందుకు వసతి చూసుకొని, పిల్లలందరినీ బస్సులో అక్కడికి తీసుకెళ్తారు. అధ్యాపకులు అక్కడ

వారికి పల్లె జీవితంలోని రకరకాల అంశాలను చూపిస్తూ వివరిస్తారు.

ఈసారి కూడా అలా పిల్లలనందరినీ వెంటబెట్టుకొని, వాళ్ళు పల్లెకు బయలుదేరారు. "పిల్లలూ! ప్రతి అంశాన్నీ జాగ్రత్తగా గమనించండి. గమనించిన అంశాలను నోట్ చేసుకోండి. వెనక్కి రాగానే 'పల్లె జీవితం' గురించి మీరు రాసిన వ్యాసాలను సమర్పించాల్సి ఉంటుంది. సరేనా?" చెప్పారు అధ్యాపకులు, బస్సులో.

గమ్యం దగ్గరవుతున్నకొద్దీ వాతావరణం మారసాగింది. ఇరుకైన రోడ్లు, ఆగిపోయిన వాహనాల స్థానే పచ్చని పొలాలు, ఎత్తైన కొండలు కనిపించసాగాయి. "మనం వెళ్తున్న పల్లె మరో ఐదు కిలోమీటర్ల దూరంలో ఉంది. అయితే అక్కడికి చేరేముందు మనం 'కోన'లో ఆగి, అక్కడున్న గుడిని సందర్శించి పోదాం" చెప్పారు అధ్యాపకులవారు.

కోనలో దిగిన పిల్లలంతా అనందం పట్టలేకపోయారు- ఉత్సాహంతో గంతులు వేశారు. పెద్ద పెద్ద వృక్షాలు, పెద్ద మెట్లబావిలో మెరుస్తున్న స్వచ్ఛమైన నీళ్ళు, ప్రక్కనే ప్రవహిస్తున్న వాగు, శుభ్రంగా ఊడ్చి ముగ్గులు పెట్టిన పరిసరాలు- ఆ ప్రశాంత వాతావరణం మొత్తం ఆనాడు పిల్లల కోలాహలంతో కళకళలాడింది.

సాయి, మిత్రులు అందరూ అక్కడ ఎగిరి, దూకి, స్నానాలు చేసి, గుడిలో దేవుడిని దర్శించుకొని, భోజనాల వేళకు కొండల నడుమన ఉన్న ఆ పల్లెకు బయలుదేరారు.



పల్లెలో ఓ పెద్ద పొలంలో ఉన్న రేకుల షెడ్డులో వాళ్లందరికీ భోజనం, వసతి ఏర్పాట్లు చేసి ఉన్నై. అద్భుతమైన భోజనం వాళ్ళకోసం

ఎదురుచూస్తూ ఉండింది.

ఆరోజంతా పంటపొలాల గురించీ, మొక్కల గురించీ రకరకాల విషయాలు తెలుసుకున్నారు వాళ్ళు. పొలాల్లో నీళ్ళు పారించటం గురించీ, బిందు-తుంపర సేద్యాల గురించీ, ట్రాక్టర్లు-కోతల యంత్రాల గురించీ ఇలా తమకు తెలీని ఎన్నెన్నో సంగతులు తెలుసుకున్నారు.



"ఈ పొలం యజమానిగారు గొప్ప ప్రకృతి ప్రేమి. ఇవాళ్ళ రాత్రి మనందరికీ వాళ్ల ఇంట్లోనే, భోజనం" అని వాళ్లందరినీ పల్లెలోకి తీసుకెళ్ళారు అధ్యాపకులవారు. అందరూ ఉత్సాహంగా ఆ యింట్లో అడుగు పెట్టారు. పెద్దవాకిలి, అందమైన లోగిలి, వాకిలికి ముందు ఓ చక్కని పెద్ద పందిరి, పందిరికి అల్లుకొని ఉన్న తీగలు, తీరుగా పూసిన పూల నుండి వెలువడే సువాసన, మరోవైపున వంటకాల ఘుమఘుమ- అందరితో బాటు సాయి కూడా మైమరచిపోయాడు.

చూడగా ఆ యిల్లు వేరెవరిదో కాదు- సాయి వాళ్లదే! ఇంట్లో అడుగు పెట్టగానే వాళ్ల అమ్మా నాన్నలు పరుగున వచ్చి వాడిని దగ్గరికి తీసుకున్నారు!

"ఇంతసేపూ మాకెవ్వరికీ ఈ సంగతి చెప్పనే లేదు కదరా! నువ్వెంత అదృష్టవంతుడివిరా, మీ ఇల్లు ఎంత బాగుందిరా! మీ అమ్మానాన్నలెంత మంచివాళ్ళురా!" ఇలా తోటి విద్యార్థులందరూ తనని పొగడ్తల వర్షంలో ముంచెత్తితే, దాన్ని తను ఇంతకాలమూ చూడనైనా చూడనందుకూ, కోపం చేసుకున్నందుకూ సాయికి ఎక్కడలేని సిగ్గు వేసింది.

అటు తర్వాత వాడికి తమ ఇల్లన్నా, పల్లె అన్నా ఎక్కడ లేని ఇష్టం కలిగిందని వేరే చెప్పనక్కర్లేదుగా?!



# పెద్దపేర్లతో తంటా

*పంథొమ్మిదో శతాబ్దపు జపాన్ లో అందరూ పెద్ద పెద్ద పేర్లు పెట్టుకునే వారట; అయితే తర్వాత్తర్వాత అంతా చిన్న పేర్లకి మారారట. "ఆ మార్పు ఎలా వచ్చిందో తెలుసుకోవాలంటే ఈ కథ చదవండి" అని పంపింది భవ్య. బాబోయ్, ఎన్ని విషయాలు నేర్చుకుంటే తయారైందో కదా, ఈనాటి మన ఈ నాగరికత?!*

*స్వేచ్ఛానువాదం: భవ్య కాట్రగడ్డ, ఆరవ తరగతి, రిషివ్యాలీ స్కూల్, మదనపల్లి, చిత్తూరు జిల్లా*

అనగా అనగా జపాన్‌దేశంలో ఒక అన్న-తమ్ముడు ఉండేవారు. అన్న 1880 లో పుట్టాడు; తమ్ముడు 1887 లో పుట్టాడు.

1880 లో  పుట్టిన తమ మొదటి కొడుక్కి వాళ్ళ అమ్మానాన్నలు ఆనాటి ఆచారం ప్రకారం **'టికిటికి టెంబోనో సారంబో హరి కరి బుష్ కీ పెరి పెంబో హై కై పం పం నికినో మీనో డొంబరాకొ**" అని పేరు పెట్టారు.

ఆనాటి జపాన్ లో ఇంకో నమ్మకం కూడా ఉండేదట- ఎవరినైనా సరే పూర్తి పేరుతోనే పిలవాలట- లేకపోతే  అశుభం! అందుకని వీలైనంత వరకూ ఈ పిల్లవాడిని అసలు ఎవ్వరూ

పిలవకుండానే పని నడిపించారట!

ఇక ఆ తర్వాత, 1887 లో తమ్ముడు పుట్టేనాటికి, ఆ తల్లిదండ్రుల ఓపిక నశించింది. పెద్ద కొడుకుకి ఉన్న పెద్ద పేరుతో అప్పటికే విసిగిపోయి ఉన్నారు మరి! అందుకని వాళ్ళు తమ ఆచారాలను పక్కన పెట్టేసి, కొత్తగా పుట్టిన తమ్ముడికి **'యాకుచి సేమో'** అని ఏదో ఒక చిన్న పేరు పెట్టేశారు. "అట్లా ఎందుకు పెడతారు?! అశుభం! మరీ అంత చిన్న పేరా?! ఎట్లాంటి రోజులు వచ్చాయి?!"అని ముసలివాళ్ళు అందరూ గొణుగుతూనే ఉన్నారట- అయినా వాళ్ళ అమ్మానాన్నలు వాళ్లని అస్సలు పట్టించుకోలేదు.

ఒకరోజు అన్న-తమ్ముడు ఆడుకునేటప్పుడు, హఠాత్తుగా యాకుచి సేమో కాస్తా అక్కడున్న దిగుడు బావిలో పడిపోయాడు.

అన్న పరిగెత్తుకుంటూ వెళ్లి "అమ్మా! అమ్మా! రామ్మా! యాకుచి సేమో బావిలో పడిపోయాడు!" అని అరిచాడు.



వెంటనే అమ్మకాస్తా పరిగెత్తుకుంటూ వెళ్లి, నాన్నతో "యాకుచి సేమో బావిలో పడి పోయాడట!" అని చెప్పింది.

నాన్నకూడా తక్షణం పరిగెత్తుకుంటూ వెళ్లి "తోటమాలీ! తోటమాలీ! యాకుచి సేమో బావిలో పడిపోయాడు!" అని అరిచాడు.

తోటమాలి పరుగెత్తుకుంటూ వచ్చి ధడాలున బావిలోకి దూకి, మునకలు వేస్తున్న యాకుచి సేమోను కాపాడాడు.

కొన్ని రోజుల తర్వాత, ఈ సారి అన్న బావిలో

పడిపోయాడు.

తమ్ముడు పరిగెత్తుకుంటూ అమ్మ దగ్గరికి వెళ్లి "అమ్మా! అమ్మా! టికి టికి టెంబోనో.......!" అంటూ పేరంతా చెప్పి, "బావిలో పడిపోయాడు!" అన్నాడు.

"ఓర్నాయనో" అనుకుంటూ అమ్మ పరిగెత్తుకుంటూ నాన్న దగ్గరికి వెళ్లి "టికి టికి టెంబోనో.......!" అని పేరంతా చెప్పి, "బావిలో పడిపోయాడట" అంది.

నాన్న పరుగెత్తుకుంటూ తోటమాలి దగ్గరికి వెళ్లి "ఓయ్! టికి టికి టెంబోనో........" అని పేరంతా చెప్పి "బావిలో పడిపోయాడు; కాపాడు! " అన్నాడు ఆందోళనగా.

తోటమాలి పరిగెత్తుకుంటూ వెళ్లి బావిలో దూకి "టికి టికి టెంబోనో...."ని బయటికి తీసుకువచ్చాడు.

అప్పటికే పొట్టనిండా నీళ్లు త్రాగి త్రాగి, చనిపోయే పరిస్థితికి వచ్చాడు 'టికిటికి టెంబోనో సారంబో హరి కరి బుష్ కీ పెరి పెంబో హై కై పం పం నికినో మీనో డొంబరాకొ'.

అప్పుడు అక్కడ చేరిన జనాలందరూ అతని పొట్టని నొక్కి నీరు బయటికి తీసి, అతని ప్రాణాన్నైతే రక్షించారు కానీ, అతను కోలుకునేందుకు చాలా రోజులే పట్టింది!

ఇక దాంతో ఆనాటి నుండీ జపాన్ లో అందరూ తమ పిల్లలకి చిన్న పేర్లు పెట్టుకోవడం మెదలుపెట్టారు- లేకపోతే వాళ్ల పిల్లలకు భద్రత ఉండదు కదా, అందుకని!

ఇంతకీ మరి మీ పూర్తి పేరేంటి? :-)

కొత్త పాఠం

కోటి రూపాయల నెక్‌లేస్ కంటే విలువైనది, మన 'నెక్' .

తియ్యటి పండుకు పునాది పుల్లటి కాయేనని మరువరాదు.




# హిమబాల

ఆంగ్ల జానపద కథ

*ఆంగ్లకథ 'స్నోవైట్' తెలుసా ? ఇదిగో, ఇక్కడున్నది ఆ స్నోవైట్ కథే- ఎటొచ్చీ పేర్లన్నీ మన దేశపువి !*
*అనువాద-అనుసరణ: ఎస్. కుమారి, తొమ్మిదవ తరగతి, కె.జి.బి.వి స్కూల్, సి.కె. పల్లి.*

అనగా అనగా ఒక చిన్న రాజ్యాన్ని దైవనందనుడు-సునందమాల అనే రాజు-రాణి పరిపాలించేవారు. వాళ్లకు అన్ని సంపదలూ ఉన్నాయిగానీ, పిల్లలు మాత్రం లేరు.

అయితే ఒకసారి సునందమాల కిటికీ దగ్గర కూర్చొని పూలు అల్లుకుంటూ ఏదో ఆలోచనలో పడింది. ఆ పరధ్యానంలో తన చేతిలోని సూది వేలుకు గుచ్చుకొని నాలుగు చుక్కల రక్తం కిటికీ అంచుమీద పడింది. చురుక్కుమనేసరికి రాణి ఈలోకంలోకి వచ్చి చూసుకునేసరికి, క్రింద పడిన ఆ రక్తపు చుక్కలు ఓ ఎర్ర గులాబిలాగా అందంగా కనబడ్డాయి.



పిల్లల ధ్యాసలో ఉన్న రాణి దాన్ని చూస్తూ "అబ్బ! నాకు ఇలా గులాబీ లాంటి పాప పుడితే ఎంత బాగుంటుంది, కదా!" అనుకుంది.

సరిగ్గా అప్పుడే ఆకాశంలో పోతున్న శివుడు-పార్వతిలకు ఆమెమీద దయ కలిగింది. వాళ్ళు "తథాస్తు" అన్నారు. అనేసరికి ఇంకేముంది, రాణీకి కొన్నాళ్ల తరువాత ఒక పాప పుట్టింది. రాజు రాణిల ఆనందానికి మేరలేదు. ఆ పాపకు 'హిమబాల'అని పేరు పెట్టి, అల్లారుముద్దుగా పెంచుకోసాగారు.



అయితే కాలం ఎప్పుడూ ఒకేలాగా ఉండదు కదా, కొన్నాళ్లకు రాణీగారికి ఏదో తెలీని జబ్బు చేసింది. రాజుగారు ఎంతమంది వైద్యులను పిలిపించినా లాభంలేకపోయింది. చివరికి ఆమె చనిపోయింది. హిమబాలేమో, మరి ఇంకా చాలా చిన్నదాయె! ఆమె బాధ్యతలు చూసుకునేందుకని, రాజుగారు మళ్ళీ పెళ్ళి చేసుకున్నారు. ఇప్పుడాయనను పెళ్ళి చేసుకున్న 'విజయసుందరి'కి హిమబాల బాగోగులకంటే తన అందం అంటేనే గొప్ప శ్రద్ధ ఉండేది.

ఆ రోజుల్లో కూడా, ఇప్పటిలాగానే రాజ్యంలో రకరకాల సమస్యలు ఉండేవి. రాజుగారు ఆ సమస్యలతోటే వ్యస్తంగా ఉండి, ఇంటి గురించి ఎక్కువగా పట్టించుకునేవారు కాదు. అట్లా ఇంటి విషయాలలో విజయసుందరి పెత్తనం చెలాయించటం మొదలైంది. ఆమె హిమబిందును రకరకాల సూటిపోటి మాటలు అనేది. హిమబిందు చేత అన్ని ఇంటి పనులూ చేయించేది.

చిన్నరాణి విజయసుందరి దగ్గర ఒక మాయ అద్దం ఉండేది. రోజూ ప్రొద్దున లేచి, స్నానం చేసి, ఆ మాయ అద్దం తీసి, "ఈ లోకంలో నాకంటే అందమైన వాళ్లు ఎవరైనా ఉన్నారా?" అని అడిగేదామె. "నీకంటే ఎవరూ అందంగా లేరు" అని సమాధానం ఇచ్చేది మాయ అద్దం. చిన్నరాణి చాలా గర్వపడేది. మురిసిపోతూ చిరునవ్వు

నవ్వుకునేది.

కొన్నాళ్లకు హిమబాల పెద్దది అయ్యింది. ఎర్ర గులాబీలాగా చాలా అందంగా తయారయింది. ఇంట్లో పనులు చేసీ చేసీ వాటినన్నిటినీ కూడా నేర్చుకున్నది. ఆ సమయంలో ఒక రోజున రాణి మాయ అద్దం తీసి, ఎప్పటి మాదిరే "ఈ లోకంలో నాకంటే అందమైన వాళ్ళు ఎవరైనా ఉన్నారా?" అని అడిగింది. "ఓఁ లేకేమి? ఉన్నది! ఇవాల్టిరోజున ప్రపంచంలోకెల్లా అందగత్తె ఎవరో కాదు- నీ కూతురు హిమబాల!" అని సమాధానం ఇచ్చింది అద్దం.

అది వినగానే విజయసుందరికి చాలా కోపం వచ్చింది. "ఏది ఏమైనా సరే! ఈ లోకంలో నాకంటే అందమైన వాళ్లు ఉండకూడదు. హిమబాలను చంపెయ్యాలి- ఇక వేరే మార్గం లేదు" అని, దారిన పోతున్న బాటసారిని ఒకడిని పిలిపించింది-

"అదిగో, అక్కడ ఆడుకుంటున్నదే, ఆ పిల్లను అడవికి తీసుకెళ్ళు. ఎవరికీ తెలీకుండా చంపెయ్యి. చంపినందుకు గుర్తుగా దాని కళ్లను నాకు తెచ్చి ఇవ్వు- నీకు పదికాలాలకు సరిపడా డబ్బు అందే ఏర్పాటు నేను చేస్తాను" అని ఆశపెట్టింది. "అట్లా చెయ్యలేదంటే నిన్ను చంపి నీ తలను కోట గుమ్మానికి వేలాడదీస్తాను జాగ్రత్త" అని అతన్ని బెదిరించింది కూడా.



దాంతో బాటసారి భయంతో "చిత్తం మహారాణీ!" అని హిమబాల దగ్గరికి పోయి "నేను నీకు అందమైన పూలు, జింకలు, చిలుకలు చూపిస్తాను రామ్మా" అని ప్రేమగా మాట్లాడి, అడవిలోకి తీసుకెళ్లాడు. అక్కడున్న పూలను, జంతువులను చూసి హిమబాల అమాయకంగా మురిసి-పోయింది; సంతోషంగా గంతులు వేసింది.

ఆ పాప అమాయకత్వాన్ని చూసిన బాటసారికి ఆమెను చంపేందుకు చేతులు రాలేదు. అతను ఆ పాపకు నిజం చెబుతూ "పాపా! మీ చిన్నమ్మ నిన్ను చంపమని నాకు అప్పగించిందమ్మా. అయితే నేను నిన్ను చంపను- ఇక్కడే వదిలేస్తాను. నీ రాత ఎలా ఉంటే అలా జరుగుతుంది- కానీ నువ్వు మటుకు ఇక మన రాజ్యానికి రాకు! వచ్చావంటే రాణి చేతిలో నీకు చావు తప్పదు!" అని ఆమెను అక్కడే వదిలేసి, గబగబా వెళ్ళిపోయాడు.

పోతూ పోతూ అతను దారిలో ఒక జింకని చంపి, దాని కళ్లు తీసుకెళ్ళి "ఇదిగోండి మహారాణీ! హిమబాల కన్నులివిగో" అని ఆమెకు అప్పగించాడు. రాణి చాలా సంతోషపడింది. మరునాడు ఉదయాన్న ఆమెకు ఇంక అద్దంలోకి చూడబుద్ధి కాలేదు. "ఎలాగూ హిమబాల చనిపోయింది కదా, అందుకని ఇంక ఈ లోకంలో నాకంటే ఎవరూ అందంగా ఉండి ఉండరులే" అనుకొని అద్దంలో చూడటం మానేసింది.

ఇక అక్కడ అడవిలో హిమబాల ఏడ్చుకుంటూ పోతుంటే, అడవి మధ్యన ఆమెకొక చక్కని పెంకుటిల్లు ఒకటి కనిపించింది. ఆ సరికి హిమబాలకు చాలా ఆకలిగా ఉంది; ఆ ఇంటి తలుపు తీసి ఉంది- కానీ తలుపు తడితే ఎవ్వరూ పలకలేదు. హిమబాల కొంచెం అనుమానంగానే ఆ ఇంట్లోకి వెళ్ళి చూసింది- ఎవ్వరూ కనబడలేదుగానీ అక్కడ టేబుల్ మీద రకరకాల వంటకాలు చక్కగా పేర్చి ఉన్నాయి. ఆకలిగొని ఉన్న హిమబాల ఆ వంటకాలన్నీ చక్కగా తిని, అక్కడే పడుకొని నిద్రపోయింది.

ఆ యిల్లు నిజానికి ఏడుగురు మరుగుజ్జులది. వాళ్ళు రోజూ వంటంతా ముగించుకొని, అడవిలోకి వెళ్ళి మరుసటి రోజుకు కావలసిన వస్తువుల్ని సంపాదించుకొని వస్తుంటారు. అట్లా

కాసేపటికి ఇంటికొచ్చిన మరుగుజ్జులకు తెరిచి ఉన్న వాకిలి కనిపించింది- "ఓఁ! మన ఇంట్లో ఎవరో దొంగలు పడ్డారు!" అని హడావిడిగా ఇంట్లోకి వచ్చిన మరుగుజ్జులకు, అక్కడ నిద్రపోతున్న

హిమబాల కనిపించింది. ఆమెను చూసి వాళ్ళకు చాలా ముచ్చట వేసింది. వాళ్ళు చాలా మర్యాదగా ఆమె వివరాలను అన్నిటినీ అడిగి తెలుసుకొని "నీకు ఎలాంటి భయమూ వద్దు; నీకు నచ్చినన్ని రోజులు మా ఇంట్లో ఉండు" అన్నారు. హిమబాల సంతోషంగా వాళ్లతోబాటు ఉండిపోయింది.

ఇక అక్కడ, రాజుగారు ఆమెకోసం మొత్తం అన్ని దిక్కులా గాలించారు. అట్లా వెళ్ళినవాళ్ళెవరికీ మరుగుజ్జుల ఇల్లుగానీ, హిమబాలగానీ అడవిలో ఎక్కడా కనబడనే లేదు. చివరికి కూడా హిమబాల ఆచూకీ తెలీని రాజుగారు "నా కూతురిని తెచ్చి ఇచ్చిన వారికి అర్ధరాజ్యంతో బాటు నా బిడ్డను ఇచ్చి పెళ్ళి చేస్తాను" అని చాటింపు వేయించాడు. అది విని ఎందరెందరో రాజకుమారులు హిమబాలకోసం గాలించా-రు. ఎవ్వరికీ మరుగుజ్జుల ఇల్లు కనబడనే లేదు.

చివరికి ఆ సంగతి తెలిసిన ప్రక్క రాజ్యపు రాజకుమారుడు విజయుడు హిమబాలను వెతుక్కుంటూ బయలు దేరాడు. విజయుడు స్వతహాగా చాలా మంచివాడు. పక్షులకు, జంతువులకు ఎంతో సాయం చేశాడు. అతనికి మటుకు మరుగుజ్జుల ఇల్లు కనబడింది. ఆ యింట్లో విచారంగా కూర్చొని ఉన్న హిమబాలను, ఆమెను నవ్వించేందుకు ప్రయత్నిస్తున్న మరుగుజ్జులను చూసి, విజయుడు వాళ్ళతో ఉల్లాసంగా మాట్లాడి, మెప్పించాడు. రాజుగారి ప్రకటన గురించి చెప్పాడు. ఆ తర్వాత వాళ్ళందరినీ వెంటబెట్టుకొని దైవనందనుడి దగ్గరికి తీసుకొచ్చాడు.

హిమబాలనుండి జరిగిన సంగతులన్నీ తెలుసుకున్న దైవనందనుడు విజయ-సుందరిని కఠినంగా శిక్షించాడు. మరుగుజ్జులను చాలా గౌరవించి, సత్క-రించాడు. విజయుడికి హిమసుందరినిచ్చి ఘనంగా పెళ్ళి చేశాడు. ఆ తర్వాత విజయుడు రెండు రాజ్యాలకూ రాజై, 'మంచి రాజు' అని పేరు తెచ్చుకున్నాడు.




# తొమ్మిదో యువతి

పెద్ద కథ

*రిషివ్యాలీ బడిలో తయారైన ఓ సరికొత్త 'జానపద కథ' ఇది. ఇంతకీ 'జానపద కథ ' అంటే ఏంటి?.. రాజుల కథేనా?!*

*రచన : క్షితిజ, నందిత, ఆరవ తరగతి, రిషీ వ్యాలీ స్కూల్, మదనపల్లి, చిత్తూరు జిల్లా.*

అనంగపురం అనే రాజ్యాన్ని అశోకవర్మ అనే రాజు పరిపాలించేవాడు. రాజు చాలా మంచివాడు- కానీ ఎంతకీ ఆ రాజుకి పిల్లలు కలగలేదు. మంత్రుల సలహా మేరకు మరో పెళ్ళి చేసుకున్నాడు- ఆమెకీ పిల్లలు కలగలేదు. అప్పుడు ఆ రాజు ఇంకో పెళ్లి చేసుకున్నాడు. అట్లా ఎనిమిది మందిని పెళ్లి చేసుకున్నప్పటికీ అతనికి పిల్లలు పుట్టలేదు! దాంతో అశోకవర్మ చాలా దిగులు చెందసాగాడు.

ఆ సయమంలో అతని అంతరంగిక మిత్రుడు వీరసేనుడు రాజుతో "ప్రభూ! రామాపురంలో కృష్ణయ్య అనే పండితుడు ఉన్నాడట. రకరకాల సమస్యలకు ఆయన

సమాధానం చెప్పగలడని విన్నాను. మీ అనుజ్ఞ అయితే, మనం ఓసారి ఆయన్ని కలిసి వస్తే బాగుంటుందని నా అభిప్రాయం" అన్నాడు.

రాజుగారు సరేనన్నారు. వీరసేనుడిని వెంటబెట్టుకొని రామాపురం వెళ్ళారు.

చూడగా కృష్ణయ్య చాలా పేదరికంలో ఉన్నట్లున్నాడు- ఆయన ఇల్లు శిథిలావస్థలో ఉన్నది. "ఈయనేనా కృష్ణయ్య..?" అనిపించేట్లుగా ఉన్నాయి ఆ పరిసరాలు. రాజుగారు ఒక్క క్షణంపాటు సందేహించారు. ఆ తర్వాత తేరుకొని, తను తెచ్చిన బహుమతులను ఆయనకు అర్పించి, తన బాధ చెప్పుకున్నారు.

కృష్ణయ్య రాజుగారి బహుమతులను పట్టించుకోకుండా ఆయనకేసి తేరిపార చూసి, "ప్రభూ! మీ జాతకం ఉంటే ఇప్పించండి" అన్నాడు. రాజుగారు తన జాతక పత్రాలను ఆయనకు చూపించారు. కృష్ణయ్య కొంతసేపు ఆ పత్రాలను జాగ్రత్తగా పరిశీలించి "రాజా! మీరు మరో పెళ్ళి చేసుకోండి. తొమ్మిదో భార్యకు సంతానం కలుగుతుంది. అయితే ఒక్కమాట- ఈ సమస్య మీ ఒక్కరిదే కాదు. మీ వంశంలోని వారందరికీ ఈ సమస్య ఉంటుందని గమనించండి" అన్నాడు.

"మీరంటున్నదేమిటో అర్థం కాలేదు మహానుభావా! వివరంగా చెప్పండి" అన్నాడు రాజు.

"మీ వంశంలోని వారందరికీ తొమ్మిది పెళ్ళిళ్ళు జరిగితే గాని బిడ్డలు కలుగరని జాతకం చెబుతోంది" అన్నాడు కృష్ణయ్య.

రాజుగారికి దిగులు వేసింది. "ఈ సమస్య తనకే కాదు- తన వంశంలో అందరికీ" అని తెలిసాక ఆలోచించారు- "నిజమే- తన తండ్రికి, తాతకు కూడా తొమ్మిది మంది భార్యలు.."

"దీనికి విరుగుడు ఏమీ లేదా, స్వామీ?!" అడిగాడు కృష్ణయ్యను.

"రాజా! దిగులు చెందకండి. నేను ప్రస్తుతం కాశీ యాత్రకు బయలుదేరుతున్నాను. తిరిగి వచ్చేందుకు కొన్ని సంవత్సరాలు పట్టవచ్చు. ఆ తర్వాత మీ ప్రశ్నకు సమాధానం అందించగల్గుతాను. అప్పటివరకూ మీ

బహుమతులతో నాకేమీ పని లేదు. వాటిని మీరు తిరిగి తీసుకుని వెళ్ళండి. ప్రశాంతంగా ఉండండి. మీ వివాహపు ఏర్పాట్లు చేసుకోండి. త్వరలో ఆ భగవంతుని దయవల్ల మీకు పుత్ర సంతానం లభిస్తుంది" అన్నాడు కృష్ణయ్య, వాళ్ళకు వీడ్కోలు చెబుతూ.

రాజు తొమ్మిదో వివాహం చేసుకున్నాడు. కృష్ణయ్య చెప్పినట్లుగానే కొన్నాళ్లకి వాళ్లకి ఒక కుమారుడు కలిగాడు. అతనికి సమీరవర్మ అని పేరు పెట్టుకుని అల్లారుముద్దుగా పెంచుకుంటున్నారు. సమీరవర్మకూడా తండ్రిలాగే ఎంతో బుద్ధిమంతుడు మరియు సాహసవంతుడు.

రోజులు గడుస్తున్నాయి. సమీరవర్మ యుక్తవయస్కుడు అయ్యాడు. రాజు అశోకవర్మకు హఠాత్తుగా ఆరోగ్యం పాడై, మంచాన పడ్డాడు. అప్పుడు అతనికి కృష్ణయ్య గుర్తుకు వచ్చాడు. "ఆయన బహుశ: కాశీ నుండి తిరిగి వచ్చి ఉండాలి.." వెంటనే రాజుగారు ఆయన్ని సకల మర్యాదలతో తోడ్కొనిరమ్మని వీరసేనుడిని పంపాడు.

అయితే కృష్ణయ్య ఇల్లు తాళం వేసి ఉన్నది. ఇంకా శిధిలమై ఉన్నది. "ఈయన ఇంకా కాశీనుండి తిరిగి రాలేదేమో.." అనుకున్న వీరసేనుడికి ద్వారబంధానికి తగిలించిన పత్రం ఒకటి దొరికింది.



అందులో ఇలా ఉన్నది: "ప్రభూ! ఇది మీకు అందేనాటికి నేను ఇక్కడ ఉండను. కుమారుడు మార్పు కోరుకుంటే వివాహానికి ముందు ఒంటరిగా వెళ్ళి ఉత్తరదిక్కున ఉన్న అడవిలో పది ఊడల మర్రి చెట్టు మొదట్లో త్రవ్వమని చెప్పండి -విధేయుడు, కృష్ణయ్య"

పత్రం చదువుకొని రాజుగారు తల ఊపారు.

రోజురోజుకీ ఆయన ఆరోగ్యం క్షీణించసాగింది. ఇంక ఎక్కువ రోజులు బ్రతకనని తెలుసుకున్న రాజు తన కొడుకు సమీరవర్మని పిలిచి తను రాసి ఉంచిన పత్రాన్ని అందించాడు- "బాబూ! నేను చనిపోతున్నాను. మన వంశానికి ఒక శాపం ఉంది" అంటూ కృష్ణయ్య చెప్పిన వివరాలన్నీ కుమారునికి చెప్పి "రాజ్యాన్ని రామరాజ్యంగా పరిపాలించు. రాముని అడుగుజాడల్లో నడుపు. నీకు 'పెళ్ళి చేసుకోవాలి' అనిపించినప్పుడు, ముందుగా ఈ పత్రాన్ని తెరిచి, దానిలో రాసి ఉన్న ప్రకారం చెయ్యి" అని అశోకవర్మ కన్ను మూశాడు.

అశోకవర్మ చనిపోయిన వెంటనే మంత్రులు సమీరవర్మకు పట్టాభిషేకం జరిపించారు. ఏడాది తర్వాత అతనికి వివాహం చేయాలని సంకల్పించారు. వివిధ దేశాల రాకుమార్తెల చిత్రపటాలను తెచ్చి చూపారు. అందరూ అందంగానే అనిపించారు సమీరవర్మకు. అయితే ఆ వెంటనే తండ్రి మాటలు గుర్తుకొచ్చాయి-

తండ్రి ఇచ్చిన పత్రాన్ని తెరిచి చూశాడు. "నాయనా! మన వంశానికి ఉన్న శాపం ప్రకారం వంశాంకురం కావాలంటే నువ్వు తొమ్మిది పెళ్ళిళ్ళు చేసుకోవాల్సి ఉంటుంది. అలాకాక, రాముడిలా ఏకపత్నీ వ్రతుడిగా ఉండాలనుకుంటే ముందు నువ్వొక్కడివే రాజ్యానికి ఉత్తర దిక్కుగా ఉన్న అడవికి వెళ్ళు- అక్కడ పది ఊడలు దిగిన మర్రి చెట్టు మొదట్లో తవ్వు" అని ఉంది అందులో.

"భార్య కోసం చెట్టు క్రింద తవ్వడం ఎందుకు?" అనుకున్నాడు సమీరవర్మ.

కానీ తండ్రి మంచితనం గుర్తొచ్చి, అడవికి ప్రయాణమయ్యాడు. మర్రిచెట్టుని చేరి, దాని మొదలు దగ్గర తవ్వాడు. ఆరడుగులు త్రవ్వాక అతనికి అక్కడ ఒక పెద్ద చెక్క పెట్టె కనిపించింది. చాలా బరువుగా ఉన్నదది. ఒక్కడే దాన్ని పైకి లాగటం చాలా కష్టం అయింది. "లోపల ఏమున్నది- ఏ బంగారమో, వెండో, ఏ నిధో ఉందా? అయినా నిధికీ నా పెళ్ళికీ ఏం సంబంధం?" అనుకుంటూ ఆ పెట్టె మూతను తెరిచి చూశాడు సమీరవర్మ. లోపల అందమైన ఎనిమిది బంగారు విగ్రహాలు ఉన్నాయి.

ఆశ్చర్యంగా ఎనిమిది విగ్రహాలూ ఎనిమిది వేర్వేరు యువతులవి! సమీరవర్మ వాటిని అన్నింటినీ జాగ్రత్తగా పరిశీలిస్తుండగా ఎనిమిదో విగ్రహం ప్రక్కన పడిఉన్న చీటీ ఒకటి అతని దృష్టిని ఆకర్షించింది. దాన్ని తీసి చదివాడు- "ఎనిమిది ముఖాలూ బాగా చూశావుగా? ఇప్పుడు ఒంటరిగానే రామాపురం పోయి కృష్ణయ్య ఇంటి మధ్యలో తవ్వి అద్దాన్ని తీసుకో" అని ఉంది.

సమీరవర్మ విగ్రహాలని కోటకి చేర్చి తర్వాత రోజు ఉదయాన్నే రామాపురానికి ప్రయాణమయ్యాడు. కృష్ణయ్య ఇంటికి చేరాడు. ఆసరికి కృష్ణయ్య ఇల్లు పూర్తిగా పాడుబడి, అక్కడక్కడా కూలిపోయి ఉన్నది.

సమీర వర్మ జాగ్రత్తగా ఇంటి లోపలికి వెళ్ళి, చీటీలో ఉన్న గుర్తుల ప్రకారం ఇంటి మధ్యలో తవ్వాడు- అక్కడో దంతపు పెట్టె బయట పడింది! ఆ పెట్టెలో ఒక గుండ్రని అద్దం, దాని ప్రక్కనే ఓ చీటీ కనిపించింది.. ఆత్రంగా ఆ చీటీని తెరిచి చదివాడు సమీరవర్మ: "ఈ అద్దంలోగుండా చూసినపుడు ఏ స్త్రీ ముఖమైతే నవ్వుతూ కనిపిస్తుందో ఆమెని నీ భార్యగా స్వీకరించు" అని రాసి ఉంది.

సమీరవర్మ కోటకి చేరి విషయాన్ని మంత్రులకి తెలియజేశాడు. "రాజ-కుమారుడిని వివాహమాడదలచిన వారంతా ఫలానా తేదీన అనంగపురానికి విచ్చేయాలొహో!" అంటూ దేశదేశాలలోనూ దండోరా వేయించారు మంత్రులు. రాకుమారుడి గొప్పతనం గురించి విన్న తల్లితండ్రులు అనేకమంది ఆశతో తమ కుమార్తెలను వెంటబెట్టుకొని ఒక రోజు ముందుగానే అనంగపురానికి విచ్చేశారు. సమీరవర్మ వారివారి తాహతుకు తగినట్లుగా వారందరికీ విడిది ఏర్పాటు చేయించాడు.

మరుసటి రోజున తనకు కృష్ణయ్య ఇంట్లో దొరికిన అద్దాన్ని తన గది ముందు వేళ్ళాడకట్టాడు సమీరవర్మ. "రాకుమారుడిని పెళ్ళాడ వచ్చిన యువతులందరూ ఆ అద్దంలో చూసి ముఖం సరిచేసుకొని లోపలకి వెళ్ళాలి" అని అద్దం ముందు నిలబడ్డ దాసీలు ఒక్కొక్క యువతికీ చెప్పసాగారు. వచ్చిన వాళ్ళంతా అద్దంలో

ముఖం చూసుకొని లోపలకి వెళ్ళసాగారు. తెర చాటున నిలబడిన సమీరవర్మ అద్దంలో ఒక్కొక్కరి ముఖాన్నీ చూడసాగాడు. మధ్యాహ్నమయ్యింది; అయినా అంత వరకూ ఒక్క యువతి ముఖం కూడా నవ్వుతూ కనపడలేదు అద్దంలో..



మెల్లగా సాయంత్రం అయ్యింది. చూసిచూసి విసుగు పుట్టిన సమీరవర్మ చల్లగాలి కోసం మిద్దెమీదికి వచ్చాడు. సరిగ్గా అదే సమయానికి లోనికి అడుగు పెడుతున్నది, మాళవదేశపు రాజకుమారి. ఆమెను చూడగానే సమీరవర్మకి చాలా సంతోషం కలిగింది- "కనీసం ఈమె ముఖమన్నా నవ్వుతూ కనపడితే బాగుండు" అనుకున్నాడు. వేగంగా క్రిందికి దిగవచ్చి, తెర చాటున నిలబడి చూడసాగాడు.

మాళవ రాకుమారి మెల్లగా నడుచుకుంటూ వచ్చింది. మొదట తెర వైపు చూసింది. రాకుమారుడు తెర వెనుక నిలబడి చూస్తున్నట్లుగా అనుమానం వచ్చిందా-మెకు. ఒక్కసారిగా ఆమెను సిగ్గు కమ్మేసింది. అలా అలవోకగా అద్దంలోకి చూస్తూ సిగ్గుతో చిరునవ్వు నవ్విందామె. నవ్వుతూ కనపడిన ఆమె ముఖం అద్దంలో కనబడగానే సమీరవర్మ తెర చాటు నుండి వెలుపలకి వచ్చాడు- మంత్రులు తెచ్చిఉంచిన పూలదండను మెడలో వేసి, ఆమెను తన భార్యగా స్వీకరించాడు.

త్వరలోనే వాళ్ళకి ఒక కుమారుడు కలిగాడు. మాళవ రాకుమారే సమీరుడి మొదటి భార్య, తొమ్మిదో భార్య కూడాను! వాళ్ల వంశాన్ని ఇప్పుడిక ఏ శాపమూ వేధించదు!





# కోడి పెట్టిన బంగారు గుడ్డు

*రచన: సి. ప్రణయజ, గుంటూరు*



విశాఖపట్టణం శివార్లలో సీతారామ కాలనీ ఉంది. దానికి కొంచెం దూరంలో పట్టణం నుండి తెచ్చిన చెత్తాచెదారం పడేస్తారు. ఆ ప్రక్కనే పట్టణపు మురుగునీరు ప్రవహిస్తుంది. సీతారామ కాలనీ వాసులు పేదవాళ్ళు . కాలనీలో ఎక్కువగా గుడిసెలు, అక్కడక్కడా మిద్దెలు ఉన్నాయి. అలాంటి ఒక మిద్దెలో రాఘవయ్య దంపతులు నివసిస్తున్నారు. పిల్లలు లేరని చాలా బెంగపడేవాళ్ళు.

ఒకరోజు ఇంటి వెనక ఉన్న చిన్నతోటకు నీళ్ళు పెడుతున్నాడు రాఘవయ్య. అంతలో పైనుండి దభాలున ఏదో వచ్చి మల్లెపొదలో పడింది. రాఘవయ్య తలెత్తి పైకి చూసాడు. ఒక కాకి ఎగురుతూ కనిపించింది. అంతలో మల్లెపొదలోంచి ఏదో అరుస్తున్న శబ్దం వినిపించింది. చూస్తే అది ఒక కోడిపిల్ల. దానికి ఒక రెక్క, ఒక కాలు విరిగి పోయి ఉన్నై. నడవలేక అక్కడే పడి అరుస్తోందది. రాఘవయ్యకు దాన్ని చూసి జాలేసింది.

నెమ్మదిగా చేతిలోకి తీసుకున్నాడు. ఇంట్లోకి తీసుకెళ్ళి దాని కాలికి కట్టుకట్టాడు; దాని రెక్కకు పసుపు, వేపాకుల లేపనాన్ని పూతగా పూసాడు. రాఘవయ్య భార్య సుభద్రమ్మ అటకపై నుండి చిన్న గంప తీసి, దాని కింద కోడిపిల్లను పెట్టింది.



ఓ గిన్నెలో కొన్ని బియ్యపు గింజలు, వేరొక గిన్నెలో నీళ్ళు పోసి గంప కింద పెట్టింది.

వారం రోజుల్లో కోడిపిల్ల కాలు, రెక్క బాగయ్యాయి. నిమిషం కూడా వదలకుండా అరుచుకుంటూ వాళ్ళ చుట్టే తిరుగుతూ ఉండేదది. పిల్లలు లేకపోవడంతో దానికి రాణి అని పేరు పెట్టుకొని, దాన్నే తమ పిల్లలాగా పెంచటం మొదలెట్టారు వాళ్ళు. అట్లా ఆరు నెలలు గడిచాయి. కోడిపిల్ల కాస్తా చిన్న కోడిపెట్టలా మారింది. అందంతోపాటు చలాకీతనం, తెలివితేటలు సొంతం చేసుకున్నది. అందంగా ఉంటానని భలే బడాయి పోవటం, వంకర టింకరగా నడవటం మొదలు పెట్టింది.

రకరకాల గింజలు, తౌడు కలిపి పొద్దున్నే రాణిముందు గిన్నెలో పెడుతుంది సుభద్రమ్మ. హాయిగా ఆరగించి పెత్తనానికి కాలనీ చివరి వరకు వెళ్తుంది రాణి. అక్కడ ఊళ్ళోవాళ్ల కోళ్ళతో, బాతులతో సాయంత్రం దాకా గడుపుతుంది. చెత్తలో ఉన్న గింజలు ఏరుకొని తింటుంది. అక్కడున్న ఆ మురికి నీరే తాగి, సాయంత్రానికి తిరిగి ఇల్లు చేరుతుంది. "అట్లా బయట తిరగద్దు- కుక్కలు, పిల్లులు పట్టుకుంటాయి' అని సుభద్రమ్మ ఎంత మొత్తుకున్నా రాణి మటుకు ఆమె మాట వినదు. కోపం వచ్చి సుభద్రమ్మ అరిస్తే రాఘవయ్య చెంతకు చేరుతుంది. ఆయన దాన్ని బుజ్జగిస్తూ

ఎత్తుకుంటాడు.

కొన్నాళ్ళకు రాణి  ఒక గుడ్డు పెట్టింది. గుడ్డును చూసిన రాఘవయ్య, సుభద్రమ్మ ఆశ్చర్యపోయారు. అది మామూలు గుడ్డు కాదు- బంగారు కాంతితో మెరిసిపోతోంది!



ఆ గుడ్డును చూడ్డానికి కాలనీ జనం గుంపులు గుంపులుగా వచ్చారు.  రాణిని పక్షిదేవత ఆవహించిందని అనుకోవటం మొదలుపెట్టారు. ఆ రోజు  మొదలు కాలనీ ఆడంగులు పొద్దుటే వచ్చి దానికి పూజలు చేయసాగారు. సాయంత్రం వరకు వచ్చే పోయే వాళ్ళతో వాళ్ల ఇల్లు తిరునాళ అయ్యింది.

ఆ నోటా ఈ నోటా సంగతి పత్రికల వాళ్ళకు తెలిసింది- అంతే! నాలుగైదు పత్రికలవాళ్ళు, ఒకరిద్దరు టివిల వాళ్ళు హుటాహుటిన సీతారామకాలనీ వచ్చి చేరుకున్నారు. రాఘవయ్యను, సుభద్రమ్మను రకరకాల ప్రశ్నలు వేశారు. కోడిపెట్టను, బంగారు గుడ్డును అన్ని వైపుల నుండీ ఫోటోలు తీశారు. మరుసటి రోజు వార్తా పత్రికలలో "కోడిపెట్ట-బంగారు గుడ్డు" అంటూ రకరకాలుగా రాశారు; టీవీల్లో మళ్ళీ మళ్ళీ చూపించారు.

విషయం తెలిసి రాజధానిలో ఉన్న పక్షి సంరక్షణ శాఖ వాళ్ళు, పక్షుల పరిశోధనశాల వాళ్ళు పరుగు పరుగున వచ్చారు. కోడిని, కోడిగుడ్డును వివిధ కోణాలలోంచి పరిశీలించి చూశారు. 'కోడిపెట్ట మీద పరీక్షలు జరుపుతాము- ఆ కోడిపెట్టను ఇవ్వండి' అని రాఘవయ్యను బ్రతిమిలాడారు. అతను దానికి 'ససేమిరా' అనేసరికి, మంత్రిగారితో సిఫార్సు చేయించారు. ఇక దాంతో ఆ

దంపతులు కన్నీళ్ళ పర్యంతం అయ్యారు. 'ఒక్కగానొక్క బిడ్డను వదిలి ఎలా ఉంటాం?' అని వాపోయారు.

'మీ కోడికి ఏమీ కానివ్వం. దాన్ని అస్సలు చంపం- మీకు భద్రంగా తెచ్చిస్తాం' అని శాస్త్రజ్ఞులు వాగ్దానం చేసాక, ఇక తప్పదని, కళ్లనిండా నీళ్ళు నింపుకొని, రాణీని వాళ్ళతో పంపారు.

శాస్త్రజ్ఞులు రాణి మీద నెలరోజుల పాటు రకరకాలుగా పరీక్షలు చేసి అసలది బంగారు గుడ్డు కానే కాదని తేల్చారు- "చెత్తా చెదారంలో ఉన్న పలు రకాల రసాయనాలతో కలుషితమైన గింజల్ని ఏరుకొని తినటం వలన, కలుషితమైన మురికి నీళ్ళు తాగటం వలన అది పెట్టిన గ్రుడ్డు సహజగుణం మారింది. అందుకే, తెల్లని పెంకుతో ఉన్న గుడ్డు బదులు రంగుతో ఉన్న గుడ్డు పెట్టింది. ఈ గ్రుడ్డు బంగారం కాదు- కాలుష్యమే" అన్నారు.

ఇంటికి తిరిగి వచ్చిన రాణీ ఎగిరి రాఘవయ్య భుజం మీద కూర్చుంది- ప్రేమగా అతని ముఖంలోకి చూస్తూ!

"ఇప్పటికైనా బుద్ధి తెచ్చుకో, కలుషితమైన గింజలు ఏరుకొని తింటే ఎన్ని కష్టాలు వస్తాయో చూడు!" చీవాట్లు పెట్టింది సుభద్రమ్మ.

ఇవేవీ తనకు పట్టనట్లు "కొక్కొక్కొక్కొ.." అని బయటికి పరుగు తీసింది రాణి.




ఈ మాసపు కార్టూన్

S.ప్రసాద్, 8వ తరగతి, రాంబిల్లి.




# రాటుదేలిన పిచ్చుక

*రచన: అఖిల్ కుమార్, ఇంటర్మీడియట్, భవానిపురం, విజయవాడ.*

అనగనగా ఒక ఊరు ఉండేది. ఆ ఊళ్లో రకరకాల చెట్లు ఉండేవి. ఒక్కో చెట్టు మీద ఒక్కో రకం పక్షులు గూళ్లు కట్టుకొని నివసించేవి. అక్కడ ఒక చెట్టు మీద గడ్డిపోచలతో ఒక గూడు కట్టుకొని నివసిస్తున్నది, ఓ పిచ్చుక.

ఆ పిచ్చుక లేకలేక మూడు గుడ్లు పెట్టింది. ఆ మూడు గుడ్లనూ జాగ్రత్తగా పొదిగింది. మూడిట్లోంచీ మూడు చిట్టి చిట్టి పిచ్చుకలు బయటికి వచ్చాయి. ఆకలివేస్తే అమ్మ కోసం కేకలు పెట్టటం తప్ప వాటికి ఏమీ తెలీదు. తల్లి పిచ్చుక తన మూడు బిడ్డలనూ చూసుకొని మురిసిపోయింది. వాటికోసం ఎక్కడెక్కడినుండో పురుగులను ఎత్తుకొచ్చి ఆహారంగా ఇస్తున్నది; వాటికి ఏ ఆపద రాకుండా కాపాడుకొంటున్నది; బిడ్డలను ఎంతో ప్రేమగా గుండెల్లో ఉంచుకున్నది.

అయితే దురదృష్టం వెంటాడింది. అదే రోజు రాత్రే ఓ తుఫాను మొదలైంది. గాలికి, వానకు చెట్లన్నీ గజగజలాడాయి. పిచ్చుక గూడు అల్లల్లాడింది. బిడ్డలను మూడింటినీ రెక్కల చాటున దాచి కదలకుండా కూర్చున్నది పిచ్చుక. "నేను ఏమైపోయినా పరవాలేదు; పిల్లలు బ్రతికితే చాలు" అనుకున్నది. అంతలోనే పైకొమ్మ నుండి నీళ్ళు సూటిగా పిచ్చుక గూడు మీదే పడటం మొదలు పెట్టాయి. ఇక తల్లి పిచ్చుక తట్టుకోలేకపోయింది. పిల్లల క్షేమం

ముఖ్యం!



అందుకని అది సాహసించింది. గాలికి ఎదురీదింది. ఇంకా రెక్కలు రాని మూడు పిల్లలనూ చెట్టు దించింది. వెంటనే ఆ ప్రక్కనే ఉన్న మర్రిచెట్టును ఎక్కించింది. ఆ కొమ్మల మాటున వెచ్చగా ఉన్న కాకి గూటికి పోయింది. "కాకమ్మా! తుఫానులో పిల్లలు తట్టుకోలేకపోతున్నాయి. గూట్లోకి నేరుగా నీళ్ళు వచ్చేసాయి. కొద్ది సేపు మమ్మల్ని నీ గూట్లో ఉండనివ్వు. ఒకసారి ఈ తుఫాను తగ్గిందంటే మేం బయటికి వెళ్ళిపోతాం. నీ రుణం ఉంచుకోం!" అని బ్రతిమిలాడింది.

"మా ఇంట్లో చోటు లేదు. మా పిల్లలూ ఉన్నాయి-వాటికి కష్టమౌతుంది. వేరే ఎక్కడైనా ఉండరాదా.." ఇట్లా రకరకాలుగా అడ్డు చెప్పింది కాకి. చివరికి తుఫాను మరింత పెరిగే సరికి, "సరే రండి- కొద్ది సేపు మాత్రమే సుమా!" అని వాటిని లోనికి రానిచ్చింది.

ఆ కాకికి రెండు బిడ్డలున్నాయి. కాకులు మూడూ ఇంట్లో విచ్చుకొని పడుకుంటే, తల్లి పిచ్చుక చుట్టూ చేరిన పిల్ల పిచ్చుకలు ఒక మూలగా ముడుచుకొని కూర్చున్నాయి.

తెల్లవారింది. కానీ తుఫాను ఇంకా వెలియలేదు. పిచ్చుక పిల్లలకు ఆకలి వేసింది. అయినా అవి కుయ్‌కయ్‌మనలేదు. కాకి పిల్లలు మటుకు "ఆకలి-ఆకలి" అని గొడవ చెయ్యటం మొదలెట్టాయి.

కొంతసేపటికి కాకి తల్లి పిచ్చుక దగ్గరకు వచ్చింది- "చూడు పిచుకమ్మా! పిల్లలు ఆకలి-ఆకలి అంటున్నాయి. బయట చూస్తే

తుఫాను. నీకు నా ఇంట్లో ఆశ్రయం ఇచ్చాను కాబట్టి, ఇప్పుడు నువ్వెళ్లి మాకు తినడానికి ఏవైనా పళ్లు తీసుకురా!" అంది. తను వెళ్ళలేని తుఫానులోకి, పాపం తల్లి పిచ్చుక మాత్రం ఎలా వెళ్ళగలదు? అయినా దుష్టబుద్ధి అయిన కాకికి వేరే సాకు ఏదీ దొరకలేదు మరి!

తల్లి పిచ్చుక ఒకసారి తన పిల్లలకేసీ, ఒకసారి కాకికేసీ చూసింది. తర్వాత "సరేనమ్మా, నా పిల్లల్నీ ఓ కంట గమనిస్తూ ఉండు- ఏదైనా ఆహారాన్ని పట్టుకొని నిముషాల్లో తిరిగి వస్తాను" అని చెప్పి ధైర్యంగా తుఫానులోకి ఎగిరిపోయింది.

తల్లి పిచ్చుక అటు పోయిందో లేదో, కాకి అమాయకపు పిచ్చుకపిల్లల మీదికి దూకింది. ఇంకేమీ దొరకనట్లు, వాటిని చంపేసి, ఆ మాంసాన్ని తన పిల్లలకు తినిపించింది!

కొంతసేపటికి తల్లి పిచ్చుక ఏదో ఆహారాన్ని పట్టుకొని వచ్చి చూస్తే ఏముంది, కాకి గూడు అంతటా తన బిడ్డల రక్తమూ, ఎముకలూ! కాకి పిల్లల నోళ్లకు ఇంకా పిచ్చుక పిల్లల మాంసం అంటుకొనే ఉంది.

"నువ్వు వెళ్ళీ వెళ్ళగానే ఓ పాడు గ్రద్ద వచ్చి పడిందమ్మా! ముద్దుగా కనబడుతున్నాయని, నీ పిల్లలు మూడింటినీ ఒక్కపెట్టున ముక్కున కరచుకొని పోయింది" అని నంగనాచిలా మాట్లాడింది కాకి.

పిచ్చుకమ్మకు ఎక్కడలేని దు:ఖం వచ్చింది. కానీ అది కాకిని ఏమీ అనలేదు- పిల్లలను చంపింది కాకే అని స్పష్టంగా తెలుస్తూనే ఉంది!

కొంతకాలం గడిచింది. పిచ్చుక ఒంటరిగా అట్లా తిరుగుతూ ఉండగా ఒకరోజున దానికి రావి చెట్టు మాటున ఒక బంగారు తీగల మూట దొరికింది. దాంతోటి అది ఈసారి రావి చెట్టుమీద ఒక బంగారపు ఇల్లు కట్టుకున్నది. ఆ గూటిని బంగారు తీగలతో రావిమానుకు బలంగా బిగించి కట్టింది- ఎంత తుఫాను వచ్చినా ఇప్పుడిక తనకు ఏమీ కాదు! ఈసారి ఆ గూటిలో రెండు గుడ్లు పెట్టి, రెండింటినీ పొదిగి పిల్లల్ని చేసింది. ఇప్పుడు తనూ-తన బిడ్డలూ ఆ

ఇంట్లో హాయిగా జీవిస్తున్నాయి.

అంతలోనే మళ్లీ ఒక పెద్ద తుఫాను వచ్చింది. ఈసారి తుఫానులో కాకి ఇల్లు కూలిపోయింది. దొంగ కాకి తన బిడ్డలతో సహా పిచ్చుకగూటి దగ్గరకు వచ్చి వాలింది. "నీకు అప్పుడు నేను ఆశ్రయం ఇచ్చాను కదా, ఇప్పుడు నాకూ ఆశ్రయం ఇవ్వు" అన్నది.



"నువ్వు, నీ బిడ్డలు నా చిన్ని పిచ్చుకలను చంపి తినేసినా ఆనాడు నేనేమీ అనలేదు. సమయం కాదని ఊరుకున్నాను. ఇప్పుడు సమయం నాది. చూడు, ప్రశ్న నువ్వు చేసిన చెడుది కాదు; నేను చేయని సాయానిది కాదు- నా గూటిలో మీరు ముగ్గురూ ఎలాగూ పట్టరు. ఇంత పెద్దగా ఎదిగిన మీ పిల్లలు తుఫానులో తడిసి కూడా ఏమీ కారు. నా పిల్లలు నాకు ముఖ్యం కాబట్టి, మిమ్మల్ని లోపలికి రానివ్వను. క్షమించు. కావాలంటే మా ఇంటి చూరులో నిలబడండి- తుఫాను వెలిసాక వేరే చెట్టు ఏదైనా వెతుక్కోండి" అన్నది పిచ్చుక ఖచ్చితంగా.

ప్రమాదంలోనూ వక్రబుద్ధిని ప్రదర్శించబోయిన కాకి, కాకి పిల్లలు వేరే ఎక్కడికీ పోలేక, వానకు తడుస్తూ,చలికి వణుకుతూ అక్కడే కూర్చుని, ఒకసారి తుఫాను వెలుస్తోందనగా వేరే చెట్టును చూసుకున్నాయి.

లోకాన్ని మార్చాలనుకుంటే ముందు నువ్వు మారు! -మహాత్మా గాంధీ



# డ్రాగన్‌నుకాచిన 'చు'

*చైనా దేశపు జానపదకథ*
*స్వేచ్ఛానువాదం: నారాయణ, కొత్తపల్లి బృందం*

చాలా కాలం క్రితం చైనా దేశంలో 'చు' అనే ధనవంతుడొకడు ఉండేవాడు. 'చు' చాలా మంచివాడు. కుర్రవాడుగా ఉన్నప్పటినుండి అందరికీ ఉపయోగపడే పనులు చాలా చేశాడు. ఆ రోజుల్లో ప్రజలకు రవాణా సౌకర్యాలు అస్సలు ఉండేవికావు. 'చూ' తన సొంత డబ్బుతోటే చాలా రోడ్లు వేయించాడు, వంతెనలు కట్టించాడు; అవసరం ఉన్న వాళ్లకు లేదనకుండా సాయం చేశాడు. తోటి వాళ్లందరూ 'చూ'ని గురించి చాలా మంచిగా అనుకునేవాళ్లు.

ఒక రోజున చేపలు పట్టేవాడొకడు తను పట్టుకొచ్చిన చేపల్ని అమ్ముకుంటుండగా మేడ మీది నుండి చూశాడు 'చూ'. ఆ చేపల్లో ఒక చిట్టి సొరచేప అతన్ని బలేగా ఆకర్షించింది. అదింకా బ్రతికే ఉన్నది. ఆ

చిట్టి చేపకు ఎర్రటి పొలుసులున్నాయి; ఎండ వెలుతురులో అది చలిమంటలాగా ప్రకాశిస్తున్నది. దాని కళ్లు నీలాకాశంలోనక్షత్రాల్లాగా మెరుస్తున్నాయి. ఆ సరికే అరవయ్యోపడిలో ఉన్న 'చు'కి దాన్ని చూస్తే చాలా ముచ్చటవేసింది.

అంత అందమైన చేపను తినటం ఏంటని, అతను దాన్ని చేపలవాడు చెప్పిన ధరకుకొని ఆ పైన దాన్ని తీసుకెళ్లి ఊరిచివరనున్న చెరువులో వదిలేశాడు. ఆ పని చేశాక ఎందుకనో, అతనికి చాలా శాంతిగాను, సంతోషంగాను అనిపించింది. ఆ చిట్టి చేప తనకేసి సంతోషంగా చూసినట్లు, తనని దీవించినట్లు భావించుకొని అతను చాలా ఉత్సాహ పడ్డాడు.

అయితే ఆ తర్వాత కొద్దిరోజులకే'చు' జబ్బు పడ్డాడు. చాలా నీరసంగాను, కళ్లు తిరుగుతున్నట్లు, అన్నిటినీ మించి నిరాశగాను అనిపించిది అతనికి. ఇక ఆ జబ్బు నుండి తాను కోలుకోలేనని, అనారోగ్యంతోనే చనిపోతానని అనుకొని 'చు' బలే నిరుత్సాహానికి లోనయ్యాడు. రాను రాను ఆ జబ్బు పెరుగుతూ పోయింది. చివరికి 'చు' పడకమీదినుండి లేవలేని స్థితి వచ్చింది.



అతను అట్లా జబ్బుతో పడుకొని ఉండగా ఒకరోజున ఎవరో ఒక పిల్లవాడు ఒకడు అతని దగ్గరికి వచ్చాడు. 'చు'గారూ! మాయజమాని నన్ను మీదగ్గరికి పంపారండి. మిమ్మల్ని తనతో బాటు భోజనానికి ఆహ్వానిస్తున్నట్లు చెప్పమన్నారు ఆయన!" అన్నాడు.

ఆ పిల్లవాడెవరో, అతని యజమాని ఎవరో 'చు'కి ఎంత ఆలోచించినా గుర్తు రాలేదు

కానీ, 'ఈ పడక మీది నుండి దిగి కొంచెం నడిస్తే బానే ఉంటుంది; మంచి భోజనం ఒకటి చేస్తే కొంచెం శక్తి వచ్చినట్లుంటుంది" అని అతను లేచి, మంచం దిగి ఆ పిల్లవాడి వెంట పోయాడు.

"నేను నిజంగానే చాలా జబ్బుపడ్డట్లున్నానే". అనుకున్నాడతను, దారిలో పోతూ;" అంతా మసకమసకగా కనిపిస్తోంది. అంతా బంగారం రంగులో మెరుస్తున్నదే, ఎందుకో?" అని. అట్లా కొద్ది దూరం పోయాడో లేదో, ఆయనొక మహలు ముందు ఉన్నాడు! ఆ మహాలు బంగారు స్తంభాలమీద నిలబడి ఉన్నది. దాని కిటికీలకు వెండి తెరలు వ్రేలాడుతున్నాయి. దూలాలకు వజ్రాలు పొదిగి ధగధగా మెరుస్తున్నాయి. ఆ భవంతికి తాపడం చేసి ఉన్న మణులు, స్ఫటికాలు విచిత్రమైన బంగారు కాంతిని వెదజల్లుతున్నాయి.

"ఇది డ్రాగన్ చక్రవర్తి ఉండే భవనం-'స్ఫటికమహాలు'లాగా ఉన్నదే" అని క్షణం కాలం పాటు నివ్వెరపోయాడు 'చు'. ఎందుకంటే దాన్ని ఇప్పటివరకూ మానవమాత్రుడన్నవాడు ఎవ్వడూ ఊహల్లో తప్ప, నిజంగా చూసి ఉండలేదు మరి!

అంతలోనే ఆ మహాలులోంచి ధగధగా మెరిసే దుస్తులు ధరించిన చక్రవర్తి ఒకాయన బయటికి వచ్చి, 'చు' ని ఆప్యాయంగా కౌగిలించుకొని, సాదరంగా లోనికి తోడ్కొని పోయాడు. గుబురుగా ఉన్న కనుబొమ్మలు, పొడవాటి కళ్ళు, 5 జటలుగా పేనిన మీసాలు-గొప్ప ఠీవిగా, రాజసంతో అలరారే ఆ చక్రవర్తి కేవలమైన మంచితనాన్ని వెదజల్లుతున్నాడు. ఆయనతో కొంతసేపు సంభాషించాక గానీ 'చు' కి అర్థంకాలేదు- ఆయన మరెవరో కాదు -స్వయానా డ్రాగన్ చక్రవర్తే!

ఆ విధంగా వాళ్లిద్దరూ పర్వతాలలోనూ, సముద్రంలోనూ లభించే వివిధ రుచుకరమైన పదార్థాలతో కూడిన గొప్ప విందులో పాలు పంచుకుంటుండగా, డ్రాగన్ చక్రవర్తి 'చు' తో చెప్పాడు. "నా చిట్టి మమవళ్లలో ఒకడు ఆడుకుంటూ ఎలా వెళ్లాడో సముద్రంలోకి వెళ్లిపోయాడు. అక్కడ వాడిని ఎవడో ఓ దొంగవాడు

బంధించి చంపెయ్యబోయాడట. వాడి అదృష్టం బాగుండబట్టి, నువ్వు వాడిని కాపాడావు. దీనికై మేం అందరం నీకు ఎల్లప్పటికీ కృతజ్ఞులమై ఉంటాం"

'చు' ఇంకా ఏమి అనకనే ఆయన కొనసాగించాడు "నిజానికి నువ్వు భూమిపైన ఉండాల్సిన సమయం ఇప్పటికి దాదాపు అయిపోవచ్చింది-కానీ నువ్వు చేపరూపంలోని డ్రాగన్‌ను ఒకదాన్ని కాపాడి మరింత కాలం భూమిపై కొనసాగే హక్కును పొందావు. నేను నీకు స్వయంగా కృతజ్ఞతలు చెప్పుకునేందుకు, ఇంకా యీ చిన్న విందును ఏర్పాడు చేశాను."

'చు' గౌరవంగా తలవంచి నమస్కరిస్తూ "మీ అభిమానాన్ని స్వీకరించేందుకు నాకు మాటలు చాలటం లేదు. మీ ఆదరణకు వేనవేల కృతజ్ఞతలు ఇకపైన నేను నా కృతజ్ఞతను వ్యక్తం చేసుకునే క్రమంలో మరిన్ని మంచిపనులు చేస్తానని మాట ఇస్తున్నాను".

ఆరకంగా మంచి విందు భోజనం చేశాక, 'చు' నిద్రలేచాడు-ఆశ్చర్యంగా అతనికి కడుపు నిండుగా అనిపించింది. "నేనేదో కలగని ఉండాలి-మరి నా కడుపెందుకు, నిండుగా ఉంది?" అని అతను ఆశ్చర్యపోయాడు. అటుపైన అతని ఆరోగ్యం బాగవ్వటమే కాదు, 120 సంవత్సరాల వరకు ఎలాంటి ఆరోగ్య సమస్యలూ లేకుండా బ్రతికాడు!






# పదరంగం-74

నిర్వహణ: కొత్తపల్లి

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | | ★ | 4 |
| ★ | 5 | | ★ | ★ | |
| 6 | | | 7 | 8 | |
| 9 | | ★ | 10 | | ★ |
| 11 | | 12 | ★ | ★ | 13 |
| | ★ | 14 | | | |

## అడ్డం

1. ఎక్కువ ముద్దు చేయటం (4)

5. ఎత్తైన తిన్నె, సింహాసనం (2)

6. " విశ్వదాభిరామ..." ఏ శతకం ? (6)

9. సంస్కృతంలో "కాపాడు" (2)

10. నిజం ఇలాంటిదట!

11. 'సుమతి' కానివాడు!

14. కోపంతో అరిస్తే ' కారాలు, ఇవీ నూరుతున్నాడం"టారు!

## నిలువు

2. రాగం మహిమ- కలిపిచెప్పు! (5)

3. సుమతీ శతకాన్ని రచించిన కవి (3)

4. బెల్లపు నీళ్లల్లో అడ్డం-14 వేస్తే తయారయ్యేది (3)

6. చేదు చెట్టు ఆకులు (4)

7. సౌరకుటుంబంలో ఆరో గ్రహం (2)

8. ఒప్పు కానిది!

12. పెద్ద సొరచేప- తిమింగలానికి చిన్నపేరు! (2)

13. ఇవి సంపూర్ణాహారం!

అడ్డం-నిలువు ఆధారాల సహాయంతో ఈ గడులను నింపగలరేమో చూడండి. నింపిన పదరంగాన్ని, కేవలం పోస్టుకార్డుపై రాసి, మాకు అందేట్లు పంపండి. మీ బడి పేరు, తరగతి, మీవాళ్ల ఫోను నంబరు తప్పక రాయండి. సరైన సమాధానం రాసి ఎంపికైన ముగ్గురు పిల్లలకు కొత్తపల్లి-76 ని బహుమతిగా పంపిస్తాం!

కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, యం ఆర్ వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా-515101

# పదాల్ని వెతికి పట్టుకోండి!

**కుటుంబాలు, ఆహారం, ఎలుకలు, విచారం, పిశాచం, ఎనిమిది, భోజనాలు, ఆవరణ, గొడుగులు, గబగబా, సంతోషం, చదరంగం, రాజుగారు, స్నేహితుడు, అభివృద్ధి, యువకుడు, పేదవాడు, అణుబాంబు, రసాయనాలు, గులకరాయి.** - ఈ పదాలన్నీ క్రింది పట్టికలో దాగున్నాయి- నిలువుగా, అడ్డంగా, వాలుగా, క్రిందినుండి పైకి- ఎటుపడితే అటు! వాటిని వెతికి పట్టుకోండి! వాటి చుట్టూ గుండ్రాలు గీయండి చూద్దాం!

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| చ | ద | రం | గం | రా | యి | హా | లు | ఎ | యి | హా | అ |
| గ | బా | సం | తో | డు | వా | ద | పే | రా | షం | ణు | సా |
| ఎ | యు | మి | ది | భో | ఆ | వ | క | ణ | బాం | తు | స్నే |
| ఎ | వ | సం | లు | జ | గు | ల | లు | బు | వి | లు | యు |
| ని | కు | తో | నా | నా | గు | బా | కు | టు | గు | డు | అ |
| మి | డు | షం | య | లు | టుం | పి | చం | డు | ఎ | లు | భి |
| ది | భి | బు | సా | కు | శా | శా | గొ | హి | లు | యి | వృ |
| రా | జా | తో | ర | లు | రు | చం | శా | పి | క | రం | ద్ధి |
| అ | వి | గొ | డు | గా | గ | రం | ణ | ము | లు | పే | శా |
| య | భి | చా | జా | హా | బ | హా | గం | ర | తో | ద | గొ |
| బాం | య | రా | రం | షం | గ | ఆ | రం | పే | వ | రం | జ |
| స్నే | హి | తు | డు | ద్ధి | బా | వృ | ణు | చం | సం | ఆ | భో |

# తెలుసుకుందాం!

*నిర్వహణ: కొత్తపల్లి*

## 1. పురాతన సొరంగాల్లో దయ్యాలుంటాయా?



ప్రముఖ రచయిత స్టీవెన్సన్ రాసిన ఓ కథలో పిల్లలు కొందరు.. "క్యాండిళ్ళు పట్టుకొని ఓ పురాతన సొరంగం లోకి దిగుతారు. వాళ్ల వెంటే వస్తున్న వాళ్ల పెంపుడు కుక్క టామీ కొంచెం దూరం పోగానే 'కుయ్..కుయ్'మనటం మొదలు పెడుతుంది. వాళ్ళు దాన్ని సముదాయించి ముందుకు సాగుతారు. ఇంకొంతదూరం పోయేసరికి కుక్క మరింత మొండికెయ్యటమే కాదు, వీళ్ళ చేతి పట్టు విడిపించుకొని వెనక్కి తిరిగి పారిపోతుంది! అయినా పిల్లలు ముందుకే వెళ్తారు... కొంచెం దూరం పోయేసరికి వాళ్ల చేతుల్లోని క్యాండిళ్ళు ఒక్కటొక్కటిగా అరిపోతాయి..అంతా చీకటి..! పిల్లలకు భయం వేస్తుంది..'వెనక్కి వెళ్ళిపోదామా' అనుకుంటారు. అంతలోనే అందరిలోకీ చిన్నవాడైన జేమ్స్ గొంతునెవరో పట్టుకొని ఒత్తినట్లవుతుంది.. వాడు క్రిందపడి గిజగిజా కొట్టుకోసాగాడు.. వాడికి సాయం చేయబోయిన మిగతా పిల్లలకూ అదే అనుభూతి ఎదురౌతుంది.. అందరి గొంతులూ బిగిసిపోసాగాయి... మరుక్షణం అందరూ జేమ్స్ ని కూడా లాక్కొని సొరంగంలోంచి బయటికి పరుగు పెడతారు. పూర్తిగా బయట పడ్డాక సంతోషంగా ఊపిరి పీల్చుకుంటారందరూ.."

పురాతన సొరంగాల్లోకి మీరు వెళ్తే మీకూ ఇలాంటి అనుభూతే ఎదురవ్వచ్చు! ఎందుకిలాగ? పురాతన సొరంగాల్లో దయ్యాలుంటాయా?

**జవాబు:**

మీరెప్పుడైనా 'కార్బన్ డయాక్సైడ్ తయారీ' చూశారా? మన ఇంట్లోనే వంటసోటా మీద వినెగర్ వేస్తే బుడగలు బుడగలుగా కార్బన్ డయాక్సైడు విడుదల అవ్వటం చూడచ్చు. ఇది మంటను మండనివ్వదు; దీనినే పీలుస్తుంటే మనకు ఊపిరాడదు; దీనికి రంగులేదు- కాబట్టి ప్రత్యేకంగా కనబడదు కూడాను.

ఇంకో సంగతేంటంటే, కార్బన్ డయాక్సైడు గాలికంటే బరువుగా ఉంటుంది. అందువల్లనే, పురాతన సొరంగాలలోను, గుహల్లోను గాలి ఎంతోకాలంగా కదలకుండా ఉంటే, దానిలోంచి ఈ వాయువు పెద్ద బరువైన పొరలాగా విడిపోయి, సొరంగపు క్రిందివైపుగా అంతటా పరచుకొని ఉంటుంది.

కుక్కలు, పిల్లులు  పెద్ద ఎత్తుగా ఉండవు కదా, అందుకని అవి ఆ సొరంగాలలోకి పోయినప్పుడు వాటికి ముందు ఊపిరాడదు- మనకంటే ముందుగానే అవి గందరగోళపడి పారిపోతాయి. క్యాండిళ్ళూ అంతే- కార్బన్ డయాక్సైడు వాటి ఎత్తు వరకూ రాగానే అవీ ఒక్కటొక్కటిగా ఆరిపోతాయి. మరి, ఆ తర్వాత జేమ్స్ లాంటి చిన్న పిల్లల వంతు- ఆపైన వాడికి సాయం చేయబోయిన పెద్దల వంతు! అంతా బయట పడి మంచిగాలిలోని ఆక్సిజన్ పీల్చుకుంటే తప్ప లాభం లేదు- ఎందుకంటే మరి పురాతన సొరంగాల్లో ఉండేది దయ్యాలు కావు- కార్బన్ డయాక్సైడు!

**2. మంట ఎప్పుడూ పైకే ఎందుకు పోతుంది?**

ఓసారి అగ్గిపుల్లను వెలిగించి చూడండి. పుల్ల క్రిందివైపున ఉంటుంది; మంట పైకి పోతుంది.

క్యాండిల్ వెలిగించి చూడండి. క్రొవ్వొత్తి క్రింద ఉంటే, మంట పైకి తిరిగి ఉంటుంది.

మరి క్యాండిల్‌ని తిరగ ద్రిప్పి వెలిగిస్తే? చేసి చూడండి- కానీ జాగ్రత్త- మంట పైవైపుకే వస్తుంది- క్యాండిల్‌ని, మీ వ్రేళ్లను కాల్చేట్లు! ఎందుకిలా జరుగుతుంది? మంట ఎప్పుడూ పైకే ఎందుకు పోతుంది?

**జవాబు:**



మంటకు నూనెనో, మైనమో- ఏదో ఒక ఇంధనం కావాలి, తెలుసుగా? ఆ ఇంధనంనుండి రకరకాల వాయువులు వెలువడి మండటం వల్లనే, ఆ మంటకు నారింజరంగో, ఎరుపో, నీలం రంగో ఏర్పడుతుంటుంది. అయితే మండే వాయువులు తమ చుట్టూతా దూరంగా ఉన్న చల్లని గాలికంటే తేలికవుతాయి. వేడెక్కిన కొద్దీ వ్యాకోచిస్తాయి కదా, అందువల్ల వాటి సాంద్రత తక్కువౌతుందన్నమాట. అలా అవి గాలిలో పైకి తేలేందుకు ప్రయత్నిస్తాయి- అందువల్లనే మంట ఎప్పుడూ పైవైపుకే పోతుంది!

### 3. చెరువులు, సముద్రాలు నీలంగా ఎందుకుంటాయి?



మీరు ఎప్పుడైనా సముద్రం చూశారా? సముద్రపు బొమ్మలైతే చూసే ఉంటారుగా? మరి సముద్రం ఏ రంగులో ఉంటుంది చెప్పండి! నీలం రంగు- 'సీ బ్లూ'- అవునా? అయితే ఓసారి ఆ నీళ్లను చేతిలోకి తీసుకొని చూడండి; మామూలుగానే ఉంటాయి!

లోతైన చెరువుల్లో నీళ్ళూ అంతే- చెరువులో ఉన్నప్పుడేమో నీలంగా ఉంటాయి; చేతిలోకి తీసుకొని చూస్తే మామూలుగానే ఉంటాయి. ఎందుకిలాగ? చెరువులు, సముద్రాలు నీలంగా ఎందుకుంటాయి?

**జవాబు:**

సముద్రాలు, చెరువులు నీలంగా కనిపించటానికి చాలా కారణాలున్నై. కానీ వాటిలో ప్రధానమైన

కారణం ఏంటంటే, ఆ నీళ్ల ఉపరితలం అద్దం మాదిరి, త్న పైనుండే నీలాకాశపు రంగును ప్రతిఫలిస్తూ ఉండటం! అంటే మనం నీళ్ళలో చూసే నీలంరంగు నిజానికి ఆకాశాపు వర్ణమేనన్నమాట!

అయితే నీళ్ళలో కరిగి ఉన్న రకరకాల లవణాలను బట్టి, నేల రంగును బట్టి కూడా ఒక్కోసారి ఈ నీలవర్ణం మారిపోతుంటుంది.  మురికి గుంటల్లో నీళ్ళు నల్లగా ఉంటాయి కదూ; అలాగన్నమాట!

మరి కృష్ణానదిలో నీళ్ళు 'కృష్ణ వర్ణం'లో - అంటే నల్లగా- ఎందుకుంటాయి, చెప్పండిప్పుడు?!







ఈ మాసపు కార్టూన్లు

*యస్. ప్రసాద్, ఎనిమిదో తరగతి,*

*జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, రాంబిల్లి,*

*విశాఖపట్నంజిల్లా.*



స్వాగతం!

కొత్తపల్లిలో పిల్లల రచనలకు ప్రాధాన్యత ఉంటుంది. ఈ పుస్తకంలో దాదాపు సగం కథలు పిల్లలు రాసినవి; మిగిలినవి పిల్లలకోసం పెద్దలు రాసినవి. బొమ్మలు వేసిన వాళ్ళు మటుకు యువకులు. పిల్లలను కలవటం, వాళ్లతో తెలుగులో కథలు రాయించటం, బొమ్మలు వేయించటం, వాళ్ళు పంపిన కథల్ని, బొమ్మల్ని సరిదిద్ది మిగతా పిల్లలందరికీ నచ్చేట్లు పుస్తకాలుగా తయారు చేయటం, దానికోసం ఓపెన్ సోర్సు ఉపకరణాలను వాడటం, కథల్ని అందరూ ఉచితంగా చదువుకునేట్లు ఇంటర్నెట్‌లో పెట్టటంతోపాటు, కొన్ని ప్రతులు అచ్చు వేయటం మాకు ఇష్టం. అందరి మేలూ కోరి చేసే ఈ పనిలో మీరూ పాలుపంచుకోండి. సాయం చేయండి. పిల్లల కథల ప్రపంచానికి స్వాగతం !

**వెలల పట్టిక:**

| | వ్యక్తులు | సంస్థలు |
|---|---|---|
| **విడి ప్రతి వెల** (పోస్టేజీ అదనం) | **25** రూ. | **25** రూ |
| **సంవత్సర చందా** (సాధారణ పోస్టు) | **300** రూ. | **350** రూ. |

సంవత్సర చందాను మనిఆర్డరు/బ్యాంకు ట్రాన్సుఫరు ద్వారా చెల్లించవచ్చు. **దయచేసి మీ చిరునామాను పోస్టు / యస్సెమ్మెస్ / ఇ-మెయిలు ద్వారా విడిగా తెలియజేయండి.** పుస్తకాలను సాధారణ పోస్టులో పంపుతాం, రచయితలు, చిత్రకారులు దయచేసి తమ రచనలను పోస్టు / ఇమెయిలు రూపంలో పంపగలరు. పిల్లల చేత పాడించిన చక్కని పాటల ఆడియోలనూ మాకు పంపండి. పిల్లలకు ఉపయోగకరంగా ఉండేవాటిని తప్పక ప్రచురిస్తాం!

బ్యాంకు ట్రాన్సుఫరు కోసం అక్కౌంటు వివరాలు:
Kottapalli Prachuranalu,
S.B. A/c No: 62320333310
SBH- Dharmavaram Branch,
IFSC code: SBHY0020902


కొత్తపల్లి ప్రచురణలు
1-127/A, యం ఆర్ వో ఆఫీసు దగ్గర,
చెన్నేకొత్తపల్లి- 515101
అనంతపురం జిల్లా
ఫోను: 7702877670
ఇ-మెయిలు: team@kottapalli.in
వెబ్సైటు: http://kottapalli.in



కృతజ్ఞతలు:

సంచిక ఆలస్యంగా వెలువడినా ఓపికగా ఎదురుచూసిన పాఠకులకు కృతజ్ఞతలు. సంవత్సరకాలంగా కళాకారులకు తనవంతుగా పారితోషికాన్నిస్తున్న రాధగారికి, ఆఫీసు ఖర్చులకోసం ప్రతినెలా క్రమం తప్పకుండా ఐదువందల రూ.లు పంపుతున్న అరుణగారికి ధన్యవాదాలు. అక్టోబరు సంచికకోసం పదివేల రూపాయలు పెద్దమనసుతో విరాళంగా ఇచ్చిన అరవింద స్కూలు యాజమాన్యానికి వేల వేల నమస్సులు.

# కొత్తపల్లికో సంవత్సర చందా

మిత్రుడు సుబ్బారావు చాలా మంచివాడు. గొప్ప పుస్తక ప్రియుడు. "కవితలు చాలా బాగుంటాయిరా, కానీ ఎందుకనో యీ కాలం పిల్లలెవ్వరూ కవితల పుస్తకాన్ని అంతగా చదవట్లేదు" అన్నాడోసారి.

"నిజమే ఒకప్పుడు తిలక్ "అమృతం కురిసిన రాత్రి" అంటేనూ శ్రీశ్రీ "మహాప్రస్థానం" అంటేనూ తెలుగు జనాలు తెగమెచ్చుకునేవాళ్ళు. యీ మధ్య అంతగా నచ్చిన కవితా సంపుటాలు అరుదు" అన్నాన్నేను.

"కవితల వరకూ ఎందుకు? పద్యాలూ అంతే. ఇదివరకు పిల్లలంతా ఎక్కాల పుస్తకాలు కొన్నట్లు వేమనశతకం, సుమతీ శతకం కొనుక్కునేవాళ్లా? ఇప్పుడు ఎవ్వరూ వాటి ఊసే ఎత్తట్లేదు" అన్నాడు సుబ్బారావు.

"వాటిని నేర్పే శక్తి, ఆ ఇష్టం ఉన్న తెలుగు మాస్టార్లూ ఉండాలి కదా. పాపం పిల్లలదేమున్నది, పెద్దలెట్లా అంటే అట్లా తలలూపుతారు" అన్నాన్నేను.

"మరి కథల పరిస్థితీ అదే కద! ఎంత మంచి కథలైనా, చదివేవాళ్లేరీ? పిల్లల్లో చదివేశక్తి పూర్తిగా తగ్గిపోయింది" అన్నాడు సుబ్బారావు, ముఖం బాధగా పెట్టి.

"అదేం లేదు. మంచి కథలు, పిల్లలకి అర్థమయ్యే పదాలు, వాళ్లు మెచ్చే అంశాలు ఉండే కథలు, చక్కని కాగితం మీద, రంగురంగుల బొమ్మల్తో వస్తే, పిల్లలు ఇష్టంగానే చదువుతారు. అయితే ఇందులో ఓ కిటుకున్నది-" ఆపాను నేను-

"ఏంటది?" అడిగాడు సుబ్బారావు.

"ఎంతమంచి పుస్తకాలైనా, పిల్లలమీద ఒక్కసారిగా పడెయ్యకూడదు-చిన్న చిన్న డోసుల్లో, కొద్ది కొద్దిగా రుచి చూపిస్తూ పోవాలి. పుస్తకాల్ని నెల నెలా తెప్పించుకుంటే లాభం అదే. నెలంతా తీరిక ఉండి ఇష్టం కుదిరినప్పుడు చదువుతారు కద, పిల్లలు? తర్వాతి పుస్తకం వచ్చేలోగా యీ నెల పుస్తకాన్ని మూడు మూడు సార్లు చదివేస్తారు! ప్రయత్నించి చూడు మీ పిల్లల్తో కూడా!" అన్నాన్నేను.

"అయితే కొత్తపల్లికో సంవత్సర చందా రాసుకో మరి! నెలనెలా వస్తుందిగా?" అన్నాడు సుబ్బారావు, మూడు వందల రూపాయలు జేబులోంచి తీస్తూ.

Printed and Published by Narayana Sarma on behalf of Kottapalli Prachuranalu and printed at Mudrica Offset Printers, Vijayawada and published at "Kottapalli", 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuram District, AP-515101. Editor: Narayana Sarma